మ. నవలాపల్కులఁ దేనె లుండు మదిలోన హాలకూటంబ యుం
డు విశేషజ్ఞుఁడు దానఁజేసియె కదా నోరూరుచు న్మోవి గ్రో
లి వెస న్విషము ముష్టిఘట్టనలఁ దాడించు న్సదా కేళివే
ళ విపశ్చిత్సురభూరుహా సురభిమల్లా మానినీమన్మథా. 51

శా. కన్పించు న్విషమత్వ మేర్పడి కటాక్షంబు ల్విషజ్వాలలై
తన్వీచక్కదనంబు పెన్పడగయై తన్వంగి సర్పాకృతిన్
మాన్పన్వచ్చు స్వభావసర్పవిషము న్సన్మంత్రము ల్వైద్యముల్
మాన్ప న్లే దిది మూర్ఖున న్సురభిమల్లా మానినీమన్మథా. 52

సీ. మరుఁ డస్త్రాలరివాఁడు భూజనము లస్మత్స్వంబుల న్భాసురా
ధరమాంసగ్రథితంబు లౌనవలతాతన్వంగు లస్త్రాలముల్
గరిమ న్సంసరణాబ్ధిలోఁ బఱపి యాకర్షించి రాగాగ్నిఁ బెం
పరుగ న్వేర్చు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 53

మ. స్తనదుర్గంబులచే దురంత మగుకాంతాదేహకాంతారభూ
మి ననంగుం డనుదొంగ తావుకొని కామిశ్రేణిచిత్తప్రజం
బనుపాంథావళి నడ్డగించుకొని ధైర్యప్రౌఢి యన్విత్త మె
ల్ల నిమేషార్ధములోఁ గొను న్సురభిమల్లా మానినీమన్మథా. 54

మ. చలమై వ్యాయతమై యరాళమయి భాస్వత్తేజమై భోగియై
నలుపై యొప్పెడుభామినీనయన మన్సర్పంబు మూర్ఖు న్ప్రా
ణులకు న్వైద్యము లేదుగాని కల వెందు న్వైద్యము ల్తక్కుచి
ల్వలు మూర్ఖున్నజనాళికి న్సురభిమల్లా మానినీమన్మథా. 55

మ. సరసీజాస్యలమేనితావియుఁ గుచస్పర్శంబు వృత్తంబు నో
ష్ఠరసంబు న్మృదుగీతము న్మరపి యాస ల్చూపి యాలోకులన్
బరమార్గంబు నెఱుంగలేనిచెడుగు ల్పంచేంద్రియంబు ల్హరీ
హరి యొప్పింపఁ దొడంగెఁగా సురభిమల్లా మానినీమన్మథా. 56

మ. నమతి న్గన్నులు ద్రిప్పఁ జేయుఁ గడు వింతౌ గాత్రభంగంబు వి
భ్రమవాక్యంబులు నెట్టుకొల్పు మదనాపస్మార మేశాంతిరూ
పము లేమంత్రము లేమహౌషధము లాపాదించిన న్మాన దు
ల్లమలంచు న్జనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 57

మ. అవి వైన న్జడుఁ డైనఁ బంగయినఁ జీకైన న్మహారోగి యై
న వియూథాత్మకుఁ డైన రోయక మది న్నాకల్పలాభస్పృహన్

సువిలాసం బగుమే నొసంగు వెలయింతు లోభాగ్యలే జ్ఞానక
ల్పవనీవల్లిక తారము ల్సురభిమల్లా మానినీమన్మథా. 58

మ. ప్రవిలాసాకృతిసొపద స్థరపయి స్ఫాసిల్లు వేశ్యాజనం
బు వలత్కామకృశానుకీల లగుచు న్బొల్పొందుచు న్విత్తముల్
నవతారుణ్యములు న్విటాళి హుతము ల్గావించిన న్జైకొనుల్
లవము న్జిక్కఁగ నీక శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 59

మ. అలరు న్గాక మనోహారంబు లయి వేశ్యావక్త్రము ల్దర్విటా
దు లనేకు ల్చవి గ్రోలి గ్రోలి విడువ న్దూష్యంబు లైనట్టియెం
గిలిమూకు ళ్ళవి యేల ముద్దుగొనఁ దర్కించు న్గులస్థానముల్
గలచారిత్రఘనుండు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 60

## సుపిరక్తదుర్విరక్తవర్ణనము.

శా. పంచారించినగుబ్బచన్నుఁగవతో భాస్వద్వళుల్మీఁదఁ గ
న్పించ న్బొల్చునలంతినెన్నడుముతోఁ బెంపొందులేఁ బ్రాయపుల్
మించున్బోఁడిబెడంగుఁ జూచి మది గంపించంగ నీ కుండువాఁ
డంచద్ధైర్యఘనుండ డిల న్సురభిమల్లా మానినీమన్మథా. 61

మ. చెలువ ల్సల్పువిలాసదృష్టిరచన ల్చిత్తంబులోఁ రోఁతగాఁ
దలఁచు న్గానలయందె గోర్కి యొసఁగు న్దా లౌల్యస మ్మోహముల్
దొలఁగించు న్దృణసన్నిభంబుగ జగత్తు న్జూచు వేతోఁక్కఁ డై
యలరు న్శుద్ధవిరాగి శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 62

శా. ఏలా చూచెద రుజ్జ్వలజ్జ్వలము లౌదృష్టు ల్పచారించి యీ
లోలాక్షు ల్చెదుబంతువు ల్మదనభిల్లుం డేయుటీవాస్త్రపుల్
ఖ్యాల ల్కాంతము లయ్యె మోహ ముడిగెన్ నా కేల పీం డ్రింక నం
చాలోచించు విరాగి దా సురభిమల్లా మానినీమన్మథా. 63

మ. హరపాదాంబుజసక్తచిత్తు లగుసన్యాసు ల్విరక్తింపింతురే
తరుణు ల్నేర్పున నల్ల ముద్దు లొలుకన్ దర్శించిన న్గాకవ
ల్గురుతి న్గోవెల ప్రేలిన న్స్మరుఁడు దా గొడ్డేటిచాపధ్వనుల్
శరమోక్షంబు నొనర్చిన న్సురభిమల్లా మానినీమన్మథా. 64

మ. హృదయంబు న్హృదయంబు సంగతము లౌ నేని న్వియోగంబుగా
దది యేదవ్వుల నుండిన న్మరి సహధ్యానంబుతో నుండినన్

హృదయంబు ల్హృదయంబు భిన్నగతు లౌ నేని స్వియోగంబు సు
మ్మది ధాత్రీజనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 65

మ. అచట న్ప్రేయసి యింతకు న్మదనబాణాపన్న యై పోయె నే
ని చనన్గాఁ బని లేదు లేక నియతి న్జీవంబుతో నున్న ము
న్నె చనంగాఁబని లే దటంచు మొఱలు న్వీక్షించి వైదేశికుం
డచలుం డై వసియించు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 66

మ. కృపయుం బ్రజ్ఞయు మైత్రియు న్నతులు గారే తత్ప్రతీసంగమం
బుపయి న్లాలస లేక భంగురము లౌ పూబోండ్లపొందు ల్విమో
హపరు ల్మెత్తురు కాలుఁ డేచుతఱిఁ దోడై కాచు నే వాండ్ర చె
ల్వపుగుబ్బ ల్ఘనితంబము ల్సురభిమల్లా మానినీమన్మథా. 67

శా. యోగాభ్యాసతఁ జిక్కు గూత్మయు మనం బుజ్జృంభ మామైత్రిచే
రాగిల్లంగఁ బొరింబొరి న్మనుల న్రామారతిక్రీడ లే
లా గాఢస్తనసంవిమర్దనము లేలా తన్ముఖామ్రాణ మే
లా గేయాదిక మేల శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 68

మ. ఘన మాసూనశరాంధకారము మది న్గారొన్న నీలోక మె
ల్లను నారీమయ మై కనంబడు విశాలం బౌవివేకాంజనం
బున నంతంతటఁ జూడ సాగిన జగంబు ల్బ్రిహ్మరూపంబు లై
యనఘు శ్రేణికిఁ గన్పడు న్సురభిమల్లా మానినీమన్మథా. 69

మ. గుముల్లై రచ్చలలోనఁ గూడుకొని యుక్తు ల్చెప్పఁగా నేమి శా
స్త్రము లెల్లం బఠియించినట్టిచతురు ల్సైతంబు కాంతామణీ
రమణీయేక్షణముల్ పయి న్బడినమాత్ర న్రోఁత లై రు (?)
ల్లము లేతెయ్యలు సల్పఁగా సురభిమల్లా మానినీమన్మథా. 70

మ. అమతు ల్కొందఱు గొన్నిశుష్కనిగమవ్యాఖ్యానము ల్నేర్చి సం
గము చీచీ కడు దుష్కృతం బనుచు వక్కాణించుటే కాని ర
మ్యమణిప్రాంచితకాంచికాన్వితనితంబాభోగ యాకాంత ను
ల్లములో నేమఱ కుండ రోసురభిమల్లా మానినీమన్మథా. 71

మ. సకియ ల్నింద్య లటంచు వట్టివెడనిష్ఠ ల్పాపుపాషండు లా
రక తాము న్జెడి లోతిని న్జెఱుచునిర్భాగ్యు ల్సుమీ యధ్వరా
దికపుణ్యంబుల కెల్లఁ బ్రాప్యఫలము ల్దివ్యాంగన ల్గారె స్త్రీ
లకు నింద్యత్వము గల్గునే సురభిమల్లా మానినీమన్మథా. 72

మ. మృగరాజు న్నగరాజుఁ గుంభి మరి గింభిం ద్రుంచి తూటాడు స
త్వగరిష్ఠు ల్గల రింతె కాని స్మరదోర్దండావలేపం బడం
పుగుణోదగ్రుఁ డొకండు లేఁడు బలిమిన్ మోమోడ కిబ్భ్యామి బ
ల్మగ లెల్ల న్వినఁ జెప్పెద న్సురభిమల్లా మానినీమన్మథా. 73

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు లజ్జాగుణ
ప్రాచుర్యంబును నామనష్టము లగు న్వృత్తాంకితంబు ల్దృఢ
భ్రూచాపచ్యుతముల్ శ్రవణపథగతంబు ల్తన్విదృగ్బాణముల్
క్రాచ న్నాగినయంతలో సురభిమల్లా మానినీమన్మథా. 74

శా. ఇత్తన్వంగులఁ గా దనం గలుగువారే తక్కొరు ల్వారు ప్రో
న్మత్తప్రేమవిహారలై సలుపుకర్మంబు త్రిలోకక్రియా
యత్తుం డైనవిధాతృఁడు న్సయితము న్వ్యావృత్తము ల్సేయ లేఁ
డాత్తాశేషసుధీజనా సురభిమల్లా మానినీమన్మథా. 75

శా. అంగంబు న్విషమాస్త్రపావకసముద్యజ్జ్వాలిక ల్గాల్చుదాఁ
కం గానంబడుఁ గాని యంతటను జీకాకై చను న్వేగ పెం
పుం గీర్తింపఁగ నాకులీనతయు నేర్పు న్బ్రజ్ఞయు న్బంతముల్
సంగీతాగమదోహలా సురభిమల్లా మానినీమన్మథా. 76

మ. నిరయద్వారకవాటపాటనముఖాంటెం బొల్చుబల్కుంచికల్
తరుణీభ్రూలత లంచు నెంచుఘనబోధస్వాంతుఁ డొక్కొక్కఁ డి
ద్ధర సంసారులలోపలం గలఁడు శాస్త్రజ్ఞానపారీణుఁ డె
ల్లరలో సద్గతిపాత్రుఁ డై సురభిమల్లా మానినీమన్మథా. 77

మ. అతిదీనంబు విలూనవాలము వికర్ణాగ్రంబు పూయవ్రణాం
కితగాత్రంబు గళైకపాలము క్షుధాఖిన్నంబు ఖంజంబు జీ
ర్ణతమం బంధము నైన వేఁపి శునివెంట న్గనుక్కు భోగార్థమై
యతనుం డెవ్వరి నొంచఁడే సురభిమల్లా మానినీమన్మథా. 78

మ. సకలార్థప్రదల న్స్వముద్ర లగుచంచన్నేత్రల న్రోసి కూ
హకులై తుచ్ఛఫలార్థు లౌజడులఁ బుష్పాస్త్రుండు ద్వేషించి న
గ్నకులు న్బంచశిఖు ల్జటాభరధరు ల్కాపాలికు ల్భ్రష్టు లై
యకటా క్రమ్మఱఁ జేయుఁగా సురభిమల్లా మానినీమన్మథా. 79

మ. రమణీబృందముఁ జూచి వాయుజలపర్ణగ్రాసు లౌగాధిపు
త్రముఖు లైనతము పాలుమాలిరి పయోదధ్యాజ్యశాల్యన్నభో

గమువం గ్రొవ్వనరు ల్జితేంద్రియు లనంగాఁ జెల్లునే వింధ్యశై
లము పాథోనిధిఁ దేలునే సురభిమల్లా మానినీమన్మథా. 80

---

## ఋతు వర్ణనము.

మ. దయివారు న్జిగిగాడ్పుల న్వలపు లందంబై చెలంగు న్వన
ప్రియనాదావళి పల్లవోజ్జ్వల మగు న్వృత్తాళి భామాస్యప
జ్క్తి యెసంగు న్విరళశ్రమాంబుకణయుక్తి న్సర్వము న్సద్గుణో
దయత న్భాసిలు నామని న్సురభిమల్లా మానినీమన్మథా. 81

మ. విరహిశ్రేణికిఁ బ్రాణసంకటము గావించె న్వసంతంబునన్
సరసంబౌ పికభామినీవిరుతము న్మందానిలవ్రాతమున్
ధర నాపన్నలతు న్సుధారసము నైతంబు న్విషంబే కదా
యరిరాడ్గర్వవిభాళ శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 82

మ. వనదండ ల్సిగఁ జుట్టి పూవుఁబోదరిండ్ల న్సత్కవు ల్గ్రోల్వఁ జెం
త గెలంత ల్కిలికించితంబు లిడుచు న్వర్తింపఁగా వెన్నెలల్
చినుకంగాఁ బికభామిను ల్పెలఁగఁగా శృంగార మాచైత్రవే
శను ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా మానినీమన్మథా. 83

మ. విరహస్త్రీవిరహానలాహుతికళావిష్కారతై చూతమం
జరు లొప్పు న్పికగేహినీహితములై చైత్రంబున న్పాటలా
పరమామోదకదంబసంభృతములై ప్రశ్రాంతిఘర్మాంబువుల్
హరియించు న్ననుగాడుపు ల్సురభిమల్లా మానినీమన్మథా. 84

మ. సుదతు ల్మోవులు జేవురింప నిడుకొంచు న్గూర్మిప్రాణేశులన్
బెదరింపంగ నొసంగినట్టియలుక ల్భేదిల్ల కెట్లుండు స
న్మదసంవర్ధనచందనద్రుమసుగంధక్లిన్న మాచైత్రఖే
లదణీయఃపవనంబు రా సురభిమల్లా మానినీమన్మథా. 85

శా. లీలాకంపనబాలచూతసుమపాళీకేసరాళీసమ
న్మీలత్సౌరభవాసితాఖిలవనానీకంబు న్యాతన్మరం
దాలోలభ్రమరార్భటీముఖరితం బౌరా వసంతంబు రా
గాలంబం బయి భాసిలు న్సురభిమల్లా మానినీమన్మథా. 86

మ. అలగ్రీష్మర్తువునన్ సుగంధరసపూరార్ద్రాద్రివక్షోజ లా
వలివేణు ల్మలయానిలంబు ధవళం బౌహర్మ్యగర్భంబు వె

న్నెల ధారాగృహము ల్ప్రసూనములు సందీపింపఁ జేయు న్మరుఁ
లలితోత్సేకవికారము న్సురభిమల్లా మానినీమన్మథా. 87

మ. జలకేళీశ్రమ మేగ సీధురస మాస్వాదించి సూక్ష్మాంశుకం
బులు పూదండలు దాల్చి చంద్రకిరణంబు ల్పర్వ సౌధంబుపైఁ
గలువ ల్సవిరు లేయఁ జందనరసస్నిగ్ధాంగు లై గ్రీష్మవే
ళల ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా మానినీమన్మథా. 88

మ. అమలజ్యోత్స్నల్ సుధావధాతశుభగేహంబు ల్ప్రియావక్త్రప
ద్మము శ్రీగంధరసంబు ఘుమ్మనువిరు ల్గ్రీష్మసౌఖ్యంబు రా
గిమనఃక్షోభము సేయుఁ గాని ప్రవిరాగిస్వాంత మింతైన లౌ
ల్యము నొందింపఁగ లేవయా సురభిమల్లా మానినీమన్మథా. 89

మ. ధృతపీనోన్నతిమత్పయోధరభరశ్రీ యై నవోజ్జృంభిమా
లతికాజాతిసుగంధి యై ఘనతటిల్లాలిత్యవిస్ఫార యై
సతతోద్దీపితకామ యై యలరువర్షావేళ రంజించుఁ జె
ల్వ తెఱం గేర్పడి ధన్యుల న్సురభిమల్లా మానినీమన్మథా. 90

మ. అవిరామంబుగ వర్తిలు న్గుటజనీపామోదు లాగాడుపుల్
నవకేకివ్రజకేకలంబు లగుకాన ల్కందళచ్ఛన్న యా
భువియు న్గార్మొగు లల్లుకొన్నగగనంబు న్జిత్తడి న్ప్రాణిజా
లవికారైకపదంబు లై సురభిమల్లా మానినీమన్మథా. 91

మ. భువి దర్శించినఁ బాండుకందళచయంబు ల్దోఁచు దిఙ్మండలం
బు విలోకించిన బర్హినాట్యరుచిరంబు లై స్థలము ల్పాసపడున్
దివిఁ గన్గొన్న మొయిళ్లు గాన నగు నర్థి న్బాంథుఁ డింకెందుఁ దా
నవలోకం బిడువాఁ డొకో సురభిమల్లా మానినీమన్మథా. 92

మ. మెఱుపు ల్పారె తళుక్కు మంచు మెఱయ న్మెండై పయోదధ్వనుల్
సెఱియ న్ఘుమ్మనుకన్నె గేదఁగివిరు ల్చేతోభవు న్బిల్వఁగాఁ
బఱచు న్నెమ్ములు గూయఁగాఁ గటకటా ప్రావృడ్దినం బెంత యు
క్కఱఁ జేయు న్బథికాంగన న్సురభిమల్లా మానినీమన్మథా. 93

శా. ఏపై చీఁకటి సూది మోప సెడ యీ కేర్పడ్డవేళ న్ధవున్
జూపట్ట న్జిటిపొట్టిచిన్కుల ఘనాళు ల్మింట వర్తిల్లఁగా
దూపించు న్జిలుఁగు న్దళుక్కునఁ దటిత్తు ల్దోఁచిన న్బిల్ల జె
ల్లావు న్గత్తె చరింపుచు న్సురభిమల్లా మానినీమన్మథా. 94

మ. జడి యట్టిట్టు చనంగ నీక ఱుమ నాసారంబు కేళీశ్రమం
బడఁప న్సీతున కల్కివల్లభులు గాఢాశ్లేషము ల్సల్పఁ బ
ల్విడి సంక్రీడ లొనర్చుభోగినుల కుర్వి న్దుర్దినంబు న్సుఖం
బడరించు న్సుదినంబ యై సురభిమల్లా మానినీమన్మథా. 95

మ. అమలాత్ముండు శరద్విభావరుల హర్మ్యాగ్రంబుల న్సాన్వదుమ
ద్యమదోన్మత్తతఁ గొంతసేపు శయితుండై లేచి సంభోగజ
శ్రమతృష్ణ న్దయితారతిశ్లథకరాంచత్కర్కరీస్రస్తతో
యము లాను న్శుచివారము న్సురభిమల్లా మానినీమన్మథా. 96

శా. నే పా ల్మించు భుజించి లోగృహములో నిద్రించుధన్యుండు వీ
టీపూర్ణాననుఁడై కుసుంభమయశాటిచ్ఛన్నుఁడై కుంకుమా
లేపప్రోజ్జ్వలుఁడై ప్రియాపృథుకుచాశ్లిష్టాంగుఁడై కంతుఖే
లాపర్యాసితుఁ డౌఁ జలి న్సురభిమల్లా మానినీమన్మథా. 97

మ. అనుఁగున్జెల్వలఁ బాసిన న్గడచు నే యాయాయయామావళుల్
ఘనకుందప్రచలద్విరేఫము స్ఫురద్గంధప్రియంగువ్రజం
బును బ్రాలేయమరుద్విలోలితవనాభోగంబు సౌశీతవే
శనిశ ల్కాలగృహోపమ ల్సురభిమల్లా మానినీమన్మథా. 98

మ. అలరుంజెక్కులు చుంబనం బిడుఁ గచవ్యాప్తంబు లౌ శ్రీముఖం
బుల సీత్కార మెసంగఁ జేయుం అవిక లొనొత్తుచు న్గుబ్బలన్
బులక ల్నించుఁ బిఱుందున న్మృదుపటంబు ల్జార్చు నూఁపు న్దొడల్
చలిగాడ్పు ల్విటు లట్లయై సురభిమల్లా మానినీమన్మథా. 99

మ. వలిగాడ్పు ల్మగలు న్బలెన్ జెలులకు న్వాసోబలాకర్షణం
బులు దృక్మీలనము ల్తనూవిచలనంబు ల్కాంతలాలోలనం
బులు బింబాధరబాధసీత్కృతిచయంబు ల్సాంద్రరోమాంచముల్
గలుగ న్జేయు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 100

మ. సతులు న్ధామును వీడెము ల్సలుపుచు న్సంభోగము ల్సేయు చు
న్నతఁడే శైశిరరాత్రి వేగఁ జను సాంద్ర న్నిబిడ్డలన్ బ్రోచుసం
తతఖేదంబునఁ గూర్కు పట్టక మది న్ధ్యానించుపేదయ్య కా
యతమై యొంతట వేగ దౌ సురభిమల్లా మానినీమన్మథా. 101

శృంగారశతకము సమాప్తము.

# వైరాగ్యశతకము.

---

## తృష్ణాదూషణము.

శా. శ్రీమచ్చంద్రకళాకలాపశిఖమై శ్రేయోదశాగ్రస్ఫుర
ద్ధామంబై ప్రవిలోలకామశలభాధిక్కారియై యాంతర
వ్యామోహోరుతమోహరం బగుశివాఖ్యజ్ఞానదీపంబు సొం
పై మీకు న్మహి మీవుత న్సురభిమల్లా వైదుషీభూషణా. 1

మ. సుమహారణ్యసుదూరదేశగతుఁ డౌచుఁ గాకిభంగి న్దుర
న్నము లందందు భుజించుచుం దిరియుచు న్జాత్యల్పులం బెక్కుగా
లము గొల్చున్ నరుఁ డేమియుం దొరక దేలా యెప్పుడు న్బాయ దు
ల్లములోఁ బాపపుఁదృష్ణ తా సురభిమల్లా వైదుషీభూషణా. 2

మ. ఇల ద్రవ్యేచ్ఛ నిధివాంఛ ధాతువితతు ల్ధ్మామింప నూఁదు న్మహీ
శులఁ గొల్చున్ నరుఁ డోడబేరము గమించు న్మాంత్రికుండై నరేం
ద్రులభూమి న్బనుఁ జీఁకటి న్గొణుఁగు నెందు న్గడ్డికా సైన లే
దలదు న్వొండియుఁ దృష్ణ దా సురభిమల్లా వైదుషీభూషణా. 3

మ. తనుఁ బోవాడిన నుత్తరం బిడక యంతర్బాష్పుఁడై యూరకుం
డు నగు న్మాన్యమనస్కుఁడై ధనమదాంధు ల్మెచ్చఁ గేల్మోడ్చు భూ
జనుఁ డోహోహా వృథావిడంబ మగు తృష్ణం జేసి యేయేవిఖే
లనము ల్సల్పు నొకో యిఁక న్సురభిమల్లా వైదుషీభూషణా. 4

మ. అమతు ల్తామరపాకుమీఁదిజల మెట్ల ట్లైనయాయుఃప్రమా
ణముకోసంబు ధనాంధచిత్తులకడ న్సంకోచ మింతైన లే
క మహాపాతక మైనయాత్మనుతియు న్గావింతు రింకేమి సే
య మది న్గోరదు తృష్ణచే సురభిమల్లా వైదుషీభూషణా. 5

మ. క్షమ లేకున్కిని తాల్మియు న్శివపదాస్వాదనంబు లేకున్కి ధ్యా
నము సంతోషము లేక యున్కి సుఖసన్న్యాసంబు యోగానుభా
వము లేకున్కి హిమాతపాదిసహనత్వంబుం జెడు న్యోగికృ
త్యము లయ్యా ఫలహీనత న్సురభిమల్లా వైదుషీభూషణా. 6

మ. తపము న్దప్తము గాదు భోగమును భుక్తం బౌట లే దాశయుం
క్షపితం బైనది కాదు కాలమును జీర్ణం బౌట లే దేపుమా
ని ప్రజల్ తప్తులు భుక్తులుం క్షపితులు న్జీర్ణాంగులుం దామె యై
యపటుత్వంబు వహింతు రా సురభిమల్లా నైదుషీభూషణా. 7

మ. మొగ మెల్ల న్వళిపూర్ణ మైనయపుడు న్మూర్ధంబున న్జన్పనా
రగతిం బాండిమ యల్లుకొన్నపుడు గాత్రంబు న్జరాక్రాంత మై
మిగుల న్సత్తువఁ దప్పినపుడును భూమిం నిత్యకౌమార మె
ట్లగునో మర్త్యులతృష్ణకు న్సురభిమల్లా నైదుషీభూషణా. 8

మ. బహుమానస్థితి దూలె భోగసుఖ లిప్స ల్దప్పెఁ బ్రాణంబువం
టిహితశ్రేణి యొకండు లేక యరిగె న్దృష్టు ల్పొర ల్గప్పెఁ బ్ర
త్యహము న్యష్ట్యభిలాషి యయ్యె గమనం బట్లయ్యెఁ బాపంపుమే
నహహా తృష్ణఁ దొలంగ దౌ సురభిమల్లా నైదుషీభూషణా. 9

మ. అగు సంసిద్ధి విమోహావర్తమము తృష్ణాళీతరంగంబు రా
గగురుగ్రాహము దుర్మనోరథజలాక్రాంతంబు చింతాఖ్యతీ
రగరిష్ఠంబు వితర్కపక్షికము ధైర్యక్ష్మాజభంగప్రదం
బగునాశానది దాఁటినన్ సురభిమల్లా నైదుషీభూషణా. 10

## విషయపరిత్యాగవిడంబనము.

మ. పస సంసారమునందు లే దొకటియు న్భావించి చూడంగఁ బు
ణ్యసముల్లాసము నార్తిదంబ యది యెట్లన్న న్స్వకర్మంబులన్
బ్రసభప్రాప్తము లై భుజింపఁబడుఁ దన్మాత్రంబు లాత్మేంద్రియ
వ్యసనాపాదకము ల్గదా సురభిమల్లా నైదుషీభూషణా. 11

మ. నిల కెన్నంటికి నైనఁ బోవు విషయానీకంబు దామై జనుల్
దొలఁగ న్లేరు తమంతట న్దొలఁగినన్ దోడ్తో శమానంద మ
గ్గలమై చేకుఱువేళ నవ్విషయ దొలంగ న్నెంటికిం దప్పి య
ల్లలనాఁడు న్మది ఖిన్నమై సురభిమల్లా నైదుషీభూషణా. 12

మ. అనఘాత్ముం డెట్టువంటిదుష్కరకరుం డత్యంతము న్రోసి చెం
దినభోగంబులె సన్యసించు నిపు డేని న్దొల్త నేనిన్ బరం
బున నేని న్దమకున్ లభింపనిస్పృహాభోగంబులు న్మాన లే
రనయంబు న్మొఱవారు శ్రీసురభిమల్లా నైదుషీభూషణా. 13

శా. ఆనందాశ్రులు గ్రోలుచు న్బులుఁగు లంకాగ్రంబులం దాడఁగా
ధ్యానారూఢతనుండ నద్రిగుహల న్ధన్యాత్ముఁ డౌ యోగి యా
ప్రాణాంతంబు మనోరథోపచితసౌధారామకేళీరతిన్
ధ్యానించున్ బెఱవాఁ డిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 14

మ. అకటా మోహము వోదు స్థండిలశయుండై నీరసాహారపుం
బికిరం బెత్తి చతుర్థవేళ దినుచు న్వేనూఱుజీర్ణంపుఁబే
లికల న్గట్టినబొంత గప్పుకొని జోలి న్బాసి వర్తించున
య్యతి న్సైతంబు జగంబున న్సురభిమల్లా వైదుషీభూషణా. 15

మ. మొగముం జేమిడిబుఱ్ఱ యిందునిక్రియం బోల్పొందునే రోఁతప
ట్లగుపూఁబోండ్లనితంబముల్ కరటికుంభాభంబులే కౌచదో
బ్బగుదుల్ చన్నులు హేమకుంభములె బీభత్సం బివీ లోకు లే
ల గరిష్ఠంబుగ నెంతురో సురభిమల్లా వైదుషీభూషణా. 16

మ. ఉమసామేన వసించునట్టి యభవుం డొక్కండు పెన్రాగి బా
ల్యమునం దుండి యసంగుఁ డౌజనుఁ డొకం డత్యంతనీరాగుఁ డు
గ్రమనోజాహివిషార్తు లన్యు లుభయభ్రష్టు ల్పమీ యందఱున్
గ్లమనిర్ముక్తభుజాబలా సురభిమల్లా వైదుషీభూషణా. 17

మ. దుముకు న్వహ్నిశిఖాళియందు శలభస్తోమంబు మీనంబు గా
లము మ్రింగున్ మది బుద్ధి లేక మనుజుల్ తత్త్వజ్ఞు లయ్యు న్విషా
దమునన్ బ్రుంగుదు రింతె కాని విషయత్యాగోత్సుకు ల్గారు శ
క్యమె మోహంబు తరింపఁగా సురభిమల్లా వైదుషీభూషణా. 18

శా. ఆసుం దప్పి జనింప స్వాదుశిశిరం బౌవారి భక్ష్యాన్వితం
బౌనన్నంబు దిను న్బుభుక్ష వొడమ న్సాక్ష్యమాతలి న్బొందు గా
ఢానంగానల మేర్ప నిట్టిది సుఖంబా రుక్ప్రతీకార మ
జ్ఞానీకంబు సుఖం బను న్సురభిమల్లా వైదుషీభూషణా. 19

మ. తనకు న్సంపద మెండు భార్య ఘనసౌందర్యాంగి తారుణ్య మె
న్న నవీనంబు సుతు ల్ప్రశస్తు లనుచు న్వ్యామోహి సంసారకా
ర నడంగు న్థిర మంచు భ్రాంతుఁ డయి సర్వం బధ్రువం బంచు మో
హనివృత్తిం జను జ్ఞాని దా సురభిమల్లా వైదుషీభూషణా. 20

## యాచ్ఞాదైన్యదూషణము.

శా. వాపోచు న్మిథఁ గుంది చాల సుతు లన్నా బువ్వ బువ్వంచు ని
ల్లాపె న్జీర్ణపటాపకర్షముల నుద్దాడింపఁగాఁ జూచి గా
కాపన్నుండు మనీషి భీతిలి పరంబౌ దేహి యన్వాక్య మే
లా పల్కుం దనపొట్టకై సురభిమల్లా నైదుషీభూషణా. 21

మ. సదుదంచద్గుణపద్మచంద్రరుచి లజ్జానూత్నవల్లీసమూ
హదృఢోదగ్రపరశ్వథంబు కడు సద్యస్మానవిచ్ఛేదనం
బిది పూరింపఁగ రానిబాన నరు నేయేరీతులం ద్రిప్పఁ జా
లదు దుర్వారవిడంబమై సురభిమల్లా నైదుషీభూషణా. 22

మ. ఒకపుణ్యస్థలిఁ జేరి వస్త్రపిహితప్రోక్షిప్తభిక్షాకపా
లకుఁడై పావనహోమధూమపటలాప్లావంబు లౌభూసురేం
ద్రకులశ్రేణులఁ జేరి మాధుకర మెత్తన్లేఁడె మర్త్యుండు తు
ల్యకుల న్వేఁడఁగ నేల శ్రీసురభిమల్లా నైదుషీభూషణా. 23

మ. అమరద్వీపవతీతరంగకణశీతారామము ల్దాపసో
త్తమవిద్యాధరసిద్ధసంఘరుచిరోదంచచ్ఛిలాభోగముల్
హిమవత్పర్వతభూము లేవఁటదఁ బోయె న్గూటికై మర్త్యజా
లము నాసింతురు పండితు ల్సురభిమల్లా నైదుషీభూషణా. 24

మ. ద్రుమశాఖోద్భవవల్కలప్రకర మబ్బు ల్పోచ్చెనే శైలజా
లములందున్ ఫలమూలకందజలము ల్వా డయ్యెనే కృచ్ఛ్రల
బ్ధమనాగ్విత్తమదానిలాప్తి బొమ లుత్కంపించుమన్నీలఁ గొ
ల్వ ముదం బేమి జనాళికి న్సురభిమల్లా నైదుషీభూషణా. 25

మ. ఖలులై వైభవగర్వదుర్వికృతిరోగగ్రస్తులై తూగుతు
ద్రుల వర్జించి దరిద్రులైన నిల కార్యు ల్వల్కలా స్తీర్ణభూ
తలశయ్యా న్ఫలమూలసేవను బ్రమోదస్ఫూర్తిఁ బ్రాపింతు ర
త్యలఘూర్వీధరవాసులై సురభిమల్లా నైదుషీభూషణా. 26

మ. అభిరామాకృతి శైలదక్ నదులతోయం బుండఁగా నెప్పుడై
న భుజింపం దరుశాఖల న్ఫలము లుండంగాఁ బరుండ న్వినూ
త్నభవత్పల్లవరమ్య మాధరణి యుండంగా పగన్ విత్తవ
ల్లభులన్ గొల్వఁగ నేమొకో సురభిమల్లా నైదుషీభూషణా, 27

శా. క్ష్మానాథాశ్రయదుఃఖభారమున భోగస్వాదసౌఖ్యంబులన్
నానాభంగులఁ బోయెఁగా దినము లిన్నాళ్ళంచు లోలో నగున్
ధ్యానాంతంబులఁ దొల్లి దాఁ బడినపాట్లంతంతఁ దోఁపం బ్రబో
ధానందుండు వనస్థుఁడై సురభిమల్లా వైదుషీభూషణా. 28

మ. పరితుష్టాత్ములు వాంఛ సేయ రతిలుబ్ధస్వాంతు లౌవాండ్రకుం
బరితోషం బొనరింపఁ జాలుదురె సంపద్ధామ మామేరుభూ
ధర మాత్రైకసమాప్తవైభవము వ్యర్థం బంచు నే నెంచెదన్
హరసేవానిరతాత్మ శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 29

శా. అక్షీణం బభయం బనల్పమతులం బానందసంపాది యా
ర్యక్షేమంకర మప్రయత్నసులభం బద్వేషదోషం బిలన్
భిక్షాజీవిక శంభుసత్ర మది యందే జ్ఞాను లాసింతు ర
ధ్యాక్షేపస్థిరవిక్రమా సురభిమల్లా వైదుషీభూషణా. 30

## భోగాస్థైర్యము.

మ. చ్యుతిచే వంశము రాజుచే ధనము రోగౌఘంబుచే భోగసం
తతి విద్వేషులచే బలంబు జరచేత న్రూపు కార్పణ్యసం
స్థితిచే మానము చాడిచే గుణము భీతిన్ జెందు నిర్భీతికం
బతులజ్ఞానమె సుమ్ము శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 31

మ. జర తారుణ్యము దుర్జనాళి నృపు నస్థైర్యంబు శ్రీ నాశ హృ
త్పరితోషంబు ఫణు ల్వనప్రతతిఁ గాంతావిభ్రమంబు ల్ప్రశాం
తిరుచి న్దుష్టజనంబు సద్గుణవిభూతి న్సొంపఱం జేయుఁ జె
ల్లరె సాతంకము సర్వము న్సురభిమల్లా వైదుషీభూషణా. 32

శా. దేవుం డెద్ది తిరం బొనర్చె నతఁ డాధివ్యాధినానావికా
రావృత్తి న్మృతి మాలి ప్రాణితతి నంతంత న్జర న్ముంచు ద్వా
రావష్టంభము లేక దుర్దశలు డాయ న్జేయు లక్ష్మీవిలా
సావేశంబుల కెమ్మెయి న్సురభిమల్లా వైదుషీభూషణా. 33

మ. అలరుం బ్రాయము లఘువంబులు తరంగాకారము ల్వైభవం
బులు ప్రాణంబులు నశ్వరంబులు దినంబుల్ స్వల్పము ల్కాపురం
బులు తుచ్ఛంబు లటంచు నెంచి యనయంబున్ బుణ్యసంకల్పముల్
దలఁచున్ దత్త్వవిదుండు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 34

మ. ప్రసరద్వాయుపరిప్లవాభ్రసలిలప్రాయంబు ప్రాణంబు మే
ఘసమూహాంతరచంచలాచలము భోగశ్రేణి తారుణ్యలా
లసలుం దుచ్ఛము లంచు నెంచి యవిలోలస్వాంతుఁ డేగు న్సధై
ర్యసమాధిస్థితసిద్ధికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 35

మ. యువతీభోగకథ ల్తటిత్సమము లాయుస్సీమ కల్లోలజా
లవిలోలం బెలప్రాయము ల్నిమిషకల్పంబు ల్ధనశ్రేణు ల
ధ్రువము ల్భోగము లస్థిరంబు లనుచున్ దూషించి తజ్జ్ఞుండు బ్ర
హ్మవిచారంబునకుం జను న్సురభిమల్లా వైదుషీభూషణా. 36

మ. ప్రసరచ్ఛోణితమాతృకుక్షితలనిర్బంధాధివాసంబు ని
ష్టసతీసంగవియోగచింతలును యోషాదూషితం బౌజరా
వ్యసనం బింతియెగా కిసీ భవమునం దాత్మ న్విచారింప స్వ
ల్పసుఖం బైన లభించునే సురభిమల్లా వైదుషీభూషణా. 37

మ. నిరతం బాయువు భగ్నకుంభసలిలానీకంబున న్లైగఁగా
నరుల ట్లామయము ల్తనువ్యథలు సేయంగా వెస న్లోఁగొనన్
జర దా బెబ్బులిభంగిఁ గాచుకొని యుండంగా నయో యేల జే
యరు లోకు ల్హితయత్నము ల్సురభిమల్లా వైదుషీభూషణా. 38

మ. అమితాకారము లైనభోగములు మాయాజాలముల్ తత్ప్రసం
గమె సంసారనిమిత్తభూత మిది యాకాంక్షింప కాశాతరం
గముల న్విహ్వల మైనచిత్తము సమాకర్షించి యల్లల్ల బ్ర
హ్మమునం జేర్చుట మే లగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 39

మ. పరమేష్ఠిప్రముఖోన్నతు ల్తృణకణప్రాయంబు లింద్రాదిరా
జ్యతతు ల్తుచ్ఛము లంచు నెంచఁగల బ్రహ్మానంద ముజ్జృంభ మై
పరమం బై పరిపూర్ణ మై యలరఁగా భావించియు న్యోగి చి
ల్లరభోగంబులు గోరునే సురభిమల్లా వైదుషీభూషణా. 40

## కాలమహిమ.

శా. ఇంబు ల్గులెక్కుడు సేన సేనపురము ల్పృథ్వీశులు న్వారియ
ర్థంబు ల్వారిసుతాప్తభృత్యబలము ల్రాజౌఘము ల్వారిభో
గంబు ల్వెంబడి మట్లమబ్బు లయి పోఁ గావింపుచుం బొల్చుకా
లంబే దైవ మవశ్యము న్సురభిమల్లా వైదుషీభూషణా. 41

మ. ఒకని న్జేగము ననేకుఁగా నొకనిఁ జేయుం దా ననేకాత్ముఁ గొం
బక మాయించు ఘటించుఁ బ్రాణివితతు ల్సారె ల్పగ ల్రేయి పా
చికలు న్లోకము లెల్లఁ బాళియునుగాఁ జేకూర్చి కాలంబు ఖే
లకుఁ జొచ్చెం గితవాకృతి న్సురభిమల్లా వైదుషీభూషణా. 42

మ. గృహకృత్యంబులచే ననంటదితమై క్షీణించు నిక్కాల మ
స్వహము న్సూర్యగతాగతక్రమవశంబై యాయు వేగు న్రుచుల్
బహుభంగు ల్సకలం బెఱింగియు జను ల్సమ్మోహకాదంబరీ
లహరి న్భ్రాంతి వహింతురా సురభిమల్లా వైదుషీభూషణా. 43

మ. ఇనుఁ డేతెంచె నినుండు గ్రుంకెఁ బగ లయ్యె న్రాత్రి జా మయ్యె రెం
డనుచున్ నిత్యముఁ బిష్టపేషణసమవ్యాపారము ల్సేయుచున్
జను లున్మాదులు గాక యాచెనఁటిసంసారంబులో నేమి మే
ల్గన వర్తించెద రీమహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 44

మ. జని విచ్ఛేదన మైనశంభుచరణాబ్జధ్యానమా లేదు స్వ
ర్గనిజద్వారకవాటపాటి యగుధర్మంబా నహీ సుందరీ
స్తనసంశ్లేషకమా యభావము మహి న్జన్మింప నేలా జడుల్
జననీయౌవనఘాతుకు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 45

మ. జవరాండ్ర న్రమియింపఁ గాన రతిభాస్వచ్చంద్రికారాత్రులన్
సవిశేషం బగువిద్య నైన నసి నైన న్వైరుల న్గెల్చి ప్రా
భవ మొప్ప న్యశ మొందఁ గానరు జను ల్పాడింటిదీపంబులీ
ల వయశ్శ్రీ వృథ యై చన న్సురభిమల్లా వైదుషీభూషణా. 46

మ. అనిశంబు న్దలిదండ్రుల న్మనుప లే రర్థం బుపార్జింప లే
రనవద్యం బగువిద్యచే నృపుల డాయ న్లేరు కాంతావిశే
లనసౌఖ్యంబులు గాంచ లేరు పలుగూళ్ళ న్గాకులు న్బోలె న
ల్పనరుల్ గాలము పుత్తు రా సురభిమల్లా వైదుషీభూషణా. 47

మ. తమపెద్ద ల్చన నాత్మతుల్యహితమిత్రవ్రాత మేగం గ్రమ
క్రమభంగి న్సికతానదీతటతరువ్రాతంబుచందంబునన్
దమరు న్సన్నిహితప్రణాశు లగుచు న్వర్తించువారల్ నరుల్
ప్రమదం బేక్రియఁ గాంతురో సురభిమల్లా వైదుషీభూషణా. 48

మ. శతసంవత్సర మాయు వందు నిశల న్సా మేగు బాలత్వప్ర

ఖోన సగ ముత్సన్నం బగున్ నిల్చియుం

న్నతఱి వ్యాధివియోగదుఃఖభయచింత ల్పెక్కు లేదీ సుఖం
బలితుచ్ఛం బగుమేనికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 49

శా. బాలుండై కొమరుం డగుం గృపణుఁడై భాగ్యోపసంపన్నుఁ డౌ
సోలుం బాండుశిరోరుహుం డయి వళీవ్యాతాంగుఁడై పిమ్మటన్
గాలాగారమహాతిరస్కరిణి కేగం జాగుభూమికుంసున
న్లై లోకంబునఁ బ్రాణి దా సురభిమల్లా వైదుషీభూషణా. 50

## యతినృపతిసంవాదము.

మ. అతఁ డైశ్వర్యమునం బ్రసిద్ధుఁడు ప్రసిద్ధాచార్యుఁడన్ నేను రా
జతఁ డే సద్గురుభక్తిసంజనితమేధాఢ్యుండ నాతం డనా
దృతిఁ గావించిన నిస్పృహుండ నగునా కే మా నటంచు న్మతిన్
యతి పాటింపఁడు భూపతి న్సురభిమల్లా వైదుషీభూషణా. 51

మ. అతఁ డర్థేశ్వరుఁ డాగమార్థపతి నే నాతండు శూరుండు వా
దితతి స్గర్వగ నే ఘనుండ నతఁ డర్థిశ్లాఘ్యుఁ డే నార్యవం
దితుఁడన్ న న్నొర మెచ్చుకున్న మును పే నే మెచ్చ నంచు న్మదిన్
యతి నిష్కామత భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 52

మ. దోర దుష్వల్వలు దాల్చు వల్కలము దాల్తున్ నే సమానంద మి
ద్దఱకుం భేద యన న్మహాశకుఁడె పో ధన్యుం డన స్తుష్టిభా
సురుఁడే పో మఱి యేఁ బ్రతిష్ఠుఁడ నటంచు న్మెచ్చుఁ డర్థేశు బ్ర
స్మరసాస్వాదపరుం డిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 53

శా. కట్టం జీరము లుండఁగాఁ దిన ఫలౌఘం బుండఁగా శయ్యకున్
బట్టై ధారుణి యుండఁగాఁ గొలఁకులం బానోదకం బుండఁగాఁ
గట్టా వైభవమద్యపానచలితాక్షవ్రాతు లాదుర్జనుల్
ధట్టింప న్బుధు లోర్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 54

శా. భిక్షాహారము లారగింపుచుఁ బ్రతృప్తిం బొంది యేచోద లే
కక్షీణం బగుమేదినీజనితశయ్యాసౌఖ్యు లౌచు న్దిశల్
సుక్షౌమంబులుగా ధరింపుచు రహి న్సొంపొందుధన్యుల్ నృపా
లక్షుద్రు న్మది మెత్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 55

మ. పలుసుద్దుల్ పలురజ్జులున్ బదరునల్పప్రజ్ఞలున్ గుబ్బచ
న్నులు గుల్కించు మెలంతలున్ సొగసుకాండ్రున్ గూడ సౌనాటపా

టలవాండ్రున్ గోఱు గాక రాజులకు నిష్ఠావంతు లౌతజ్ఞు లే
ల లసద్దానశశీశ్వరా సురభిమల్లా వైదుష్షీభూషణా. 56

మ. భువనం బెందఱు నేర్ప రెందఱు ప్రగల్భు లొప్పిచి పో రెంద ఱా
ర్యవరు ల్గెచ్చి తృణీకరించిరి ధరన్ జ్యాధీశు ల ట్లేగ నా
రారా యిం దొకకొన్నిపల్లెలకుఁ దా రధ్యక్షు లై యల్పు లే
ల వృథా గర్వ మొనర్తురో సురభిమల్లా వైదుష్షీభూషణా. 57

మ. ధరణీశాయుతభుక్తముక్త మగునిద్ధాత్రీతలం బంతయున్
బరిపాలించినవారు సైతము తృణప్రాయుల్ తదంశాంశముల్
పరిపాలించునృపాధముల్ మది జుగుప్సాఖేదము ల్దక్కి యే
ల రహిన్ గ్రొవ్వి చరింతురో సురభిమల్లా వైదుష్షీభూషణా. 58

మ. వివిధాయోధనదారుణంబుల మిథోవిద్వేషు లై తోయప
ఙ్క్తివృతం బౌపరమాణుకూటకృతమృత్పిండంబు భోగించుచు
న్ద్రవిచారు ల్దూర లీవు లిత్తు రని తత్స్వల్పార్థ మాశించువా
రవమప్రాణులు గారొకో సురభిమల్లా వైదుష్షీభూషణా. 59

మ. భవుఁ డాత్మీయకపాల మాదల వహింపన్ మన్నవాగ్దేవతా
ధవుఁ డొక్కండె విభుండు తక్కురున కాత్మప్రాణసంరక్షణ
ప్రవణు ల్లల్పరు మ్రొక్కనంత నె మదింపం జెల్లునే వాని నే
ల విభుం డంద్రు సుధీజను ల్సురభిమల్లా వైదుష్షీభూషణా. 60

---

## మనస్సంబోధనము.

మ. పరచేతశ్చ్రియ మాచరింపఁ జనుచున్ ప్రశాంత మ్మాఁ గాని తా
నరయ న్మర్త్యుల మానసంబు విమలం బై యుండ దట్లున్నఁ జె
చ్చెర నిష్టార్థము లన్నియు న్గలుగవా చింతామణిస్తోమప
ల్లరి చేపడ్డవిధంబున న్సురభిమల్లా వైదుష్షీభూషణా. 61

మ. అవు నర్థం బగుఁ గానియర్థ మది గా దామాత్రకుం జిత్త మే
ల వెతన్ జెందు నతీతభావిసరణు ల్తర్కింప కైనర్థ భో
గవితానంబు భుజించు లేనితఱి నిక్కం బూర కుండు న్బుధుం
డవలం దా నిఁక నేమి శ్రీసురభిమల్లా వైదుష్షీభూషణా. 62

మ. విషయైకస్పృహమైఁ జరింపుచు భవస్వీకారి గాకుల్ల ము
న్నిష్ఫదాయూనవివర్తకం బయినస్వాత్మీభావముం జెందినన్

విషమక్లేశవిదూర మౌ సుఖగతి న్విశ్రాంత మౌ నాజిక్షే
లషదాస్యప్రతిరూప శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 63

మ. విలసజ్జహ్నుసుతాతటాభిరతిమై విశ్వేశుఁ జింతింప ను
త్కళిక న్సంపద లేల కోరునొకా చిత్తం బకటా వీచికల్
కలుము ల్బుద్బుదము ల్మెఱుంగులు నరౌఘంబు ల్ఘను ల్వహ్నికీ
లలు నమ్మం దగునా మహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 64

మ. నృపతిభ్రూలతికాకుటీగణిక యాశ్రీ గోర కార్యుండు కా
శిపురిం జేరి వినీతకంథుఁ డగుచున్ శిష్టాత్ము లచ్చో జనుల్
గృప నర్పించినపాణిపాత్రహృతము ల్భిక్షాన్నముల్ దించు శీ
లపరుండై మెలఁగం దగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 65

మ. ఎదుటన్ గాణలు వెన్కఁ జామరధరల్ హేలావయోరమ్య తా
సుదతు ల్క్రేవల దాక్షిణాత్యసుకవీశు ల్గొల్తు రేని న్ప్రియం
బె డగ న్మర్త్యుఁడు కాపురించఁ దగు లేదే యోగి యై యొక్కశై
లదరిం జేరికొనం దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 66

మ. అభిరామం బగులక్ష్మి చేకుఱిన నే మాత్మీయమిత్రాళులన్
విభవోపేతులఁ జేసి శాత్రవరమావిస్ఫూర్తిఁ గైకొన్న నే
మి భయప్రోజ్ఝితమై మనం గలదె భూమిన్ మర్త్యసంఘంబు దు
ర్లభ మౌ దేహము నిత్యమై సురభిమల్లా వైదుషీభూషణా. 67

మ. మమకారంబు త్యజించి కామవికృతు ల్మాయించి సంసారక
ర్మము లెల్ల న్మది రోసి యీశ్వరునిపై రాగంబు సంధించి దూ
రము శోకానలు చేరి మానవుఁడు వైరాగ్యస్థుఁ డౌ నేని యే
ల మహేంద్రాదిపదంబులు న్సురభిమల్లా వైదుషీభూషణా. 68

మ. సకలాశావలయంబుల న్సతతసంచారంబు గావించుఁ గొం
చక నైసర్గికలోలభావమున విశ్వం బెల్ల వ్యాపించుఁ దా
నొకనాఁ డేమఱి యైన మర్త్యులమనం బూహింప దుల్లాసక
ల్పకుఁ డైనట్టిమహేశ్వరున్ సురభిమల్లా వైదుషీభూషణా. 69

మ. అమరేంద్రాదిపదంబు లన్నియుఁ దరిద్రాపేక్ష్యముల్ వానిమీఁ
ద మనం బుంచక నిర్వివేకత ననంతం బై పరం బై ప్రకా

శమయంబై యలరారుబ్రహ్మము రహిన్ జర్చింప సర్వార్థముల్
సమకూరు న్సులభంబులై సురభిమల్లా వైదుషీభూషణా. 70

## నిత్యానిత్యవస్తువిచారము.

మ. అమరావాసకుటీవిహారఫల మాయాగాళి యంచు న్పురా
ణము లంచున్ స్మృతు లంచు వేద మనుచున్ శాస్త్రం బటంచున్ నరుల్
భ్రమచేఁ గోమటిబేరపుర్ వగల కేలా చొత్తురో యాత్మ బ్ర
హ్మమునం జేర్పఁగ లేక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 71

శా. కాలాంతాగ్ని సువర్ణశైలము పడంగా వారిరాసు ల్సెడం
గా లోకాశ్రయ మైనధారుణి సనంగాఁ గుంజరేంద్రశ్రవో
లోలం బౌతను వెంతమాత్రము నరు ల్మోహాంధులై దీని కే
లా లోభింతు రెఱింగియుం న్సురభిమల్లా వైదుషీభూషణా. 72

శా. వ్యామోహంబు వహించి వీను బధిరంబై నోరు లాలాయుతం
బై మే నానతమై రదాళి పతితంబై దృష్టి యుత్పాదితం
బై మానస్థితి భ్రష్టమై నరుఁడు పంగై యున్నఁ గైకోరు పెం
డ్లాము న్బిడ్డలు నైతము న్సురభిమల్లా వైదుషీభూషణా. 73

మ. జరఁ బ్రాపించి కరంబు పాండురశిరోజశ్మశ్రుఁడై యున్నయ
న్నరు సుత్రిష్టగవాస్థిఖండ మగుచండాలోదపానంబువై
ఖరి దొదవ్వుల రోసి పాయుదు రిలన్ గంజాక్షు లుద్వేల్లబ
ల్లరగండాదిమహాంక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 74

మ. జర ప్రాప్తించకమున్నె యక్షిబల ముత్సన్నంబు దాఁ గాకము
న్నె రుజల్ ముంపకమున్నె యాత్మహిత మన్వేషింప కజ్ఞుండు మం
దిరదాహం బగునప్డు శాంతివిధి కెంతే కూపముం ద్రవ్వునా
లరియ న్లై నగుఁబా టగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 75

మ. ఇతిహాసాగమకావ్యము ల్చదువఁ బ్రొద్దేదీ మల ల్సేరి యా
దృతిమై యోగతపక్రియ ల్సలుపఁ బ్రొద్దేదీ యతిప్రశ్రయా
న్వితుఁడై దాతృజనంబులం గొలువఁ బ్రొద్దేదీ కటా యాయుం వ
ల్పతరంబై చనుప్రాణికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 76

మ. దొరలత్యంతమదాంధకుల్ చపలచిత్తుల్ సౌఖ్యవాంఛల్ సుదు
ర్భరము ల్దేహవిఘాతియైనజర దుర్వారంబు కాలుండు ము
ష్కరుఁ డొం డెద్దియు లేదు మేలు విమలజ్ఞానంబుకన్నన్ నిజం
బరయం బండితకోటికి స్సురభిమల్లా వైదుషీభూషణా 77

మ. ధనహీనుం డయి మిత్రభృత్యరహితత్త్వం బొంది యర్థార్థి వ
చ్చిన నీయం దగఁ దప్పి దైన్యదశల న్జేడ్పష్టవేళ న్సుప
ర్వనదీతోయపవిత్రకుంజయుత మాప్రాలేయశైలంబు మె
ల్లనఁ జేరం దగు జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 78

మ. హితసాంగత్యము లిందుకాంతిసుఖముల్ శృంగారకావ్యంబు లి
ష్టతమావక్త్రములు న్విలాసవనము ల్సర్వంబు నత్యంతర
మ్యతరం బయ్యు ననిత్యతామతి జనింపం దద్దయుం దానర
మ్యతరం బై కనిపించు నా సురభిమల్లా వైదుషీభూషణా. 79

మ. ఘనహర్మ్యంబులు కామినీలలితము ల్గానాదికంబు ల్మనం
బునకు న్సైపక కాదు తజ్ఞు లనయంబు న్గీటపక్షానిల
ప్రనటద్దీపశిఖాచయంబు లనుచు న్భావించి సుమ్మీ గిరుల్
వనము ల్చేరుదు రర్మిలి న్సురభిమల్లా వైదుషీభూషణా. 80

---

## శివార్చనము

శా. ఏనాఁ డైనను నేజగాన నయినన్ దృగ్గత్సుఁ డైనన్ శ్రుతుం
డైనం గాఁడు తథావిధుండు విషయోద్యత్కుంజరీరూఢదు
ర్జ్ఞానక్షీణమనఃకరిన్ నిలుప నౌరా యెవ్వఁడో సంయమా
లానం బయ్యెడు ధారుణి న్సురభిమల్లా వైదుషీభూషణా. 81

మ. శమసంపాదిని యైనవిద్య దొరకు న్సద్గోష్ఠి గల్గు న్మనో
దమనం బబ్బు నదైన్యవృత్తియును లబ్ధం బౌ నసంగప్రచా
ర మొగిం జేకుఱు నొక్కపుణ్యఫలసంప్రాప్తిన్ నిరూపింప శ
క్యము గాదెద్దియుం జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 82

మ. సుగుణశ్రేణు లనన్యగోచరము లౌచు న్రిత్త క్షీణింప నిం
పగుతారుణ్య మతిక్రమింపఁ దలఁపుల్ వ్యర్థంబులై పోవ ను
గ్రగతిం గాలుఁడు చేర రా జనులకు న్గౌరీకళత్రుండె ది
క్కగు నందున్ దెలియం దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 83

మ. సకలస్థావరజంగమైకవిభుఁ డై శంభుండు సర్వాంతరా
త్ముకుఁ డై విష్ణుఁడు వస్తుతత్త్వము వలంపంగా నభిన్నస్వరూ
పకు లయ్యుఁ గ్ మది నాదుభక్తి పరమబ్రహ్మంబు భర్గుండె యం
చకలంకస్థితి భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 84

మ. కనదిందుద్యుతిపాండురంబు లగుగంగాసైకతక్షోణులన్
ఘనసంతోషభవాశ్రులై శివ శివా కాశీపతీ యంచు ను
త్కనినాదంబుల బిగ్గరం బలుకుచున్ గాందారెమాందారె వే
శను ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 85

మ. తుద ముప్పౌఁగద యంచుఁ గాపురపుసుద్దు ల్రోసి సన్యస్తసం
పదులై సాత్త్వికులై వనస్థలులు సంప్రాపించి సంపూర్ణశా
రదచంద్రాతప తామహానిశల శర్వశ్రీపదాంభోజముల్
మదిఁ జింతింతురు పండితు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 86

శా. కాశిం జేరి త్రివేణి చెంగటఁ గటీకౌపీనమాత్రాంశుకుం
డై శీర్షంబునఁ గేలు మోడ్చుకొని శర్వా శంకరా శైలజా
ధీశా యంచు వచింపుచుం గడపుఁ బ్రీతి న్వాసరంబు ల్ఘనుం
డౌ శిష్టప్రవరుండు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 87

శా. గంగాతోయముల న్సుపుష్పజలసంఘాతంబున న్విశ్వభ
ర్తం గామాంతకుఁ బూజచేసి పిదప ధ్యానంబు గావింపుచున్
తుంగగ్రావనిషణ్ణులై యలరుధన్యుల్ దైన్యసంతాపముల్
భంగం బంద సుఖింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 88

మ. అనవద్యుండును పాణిపాత్రహృతభిక్షాహారుఁడున్ నిస్పృహుం
డును శాంతుండు దిగంబరుండు నయి ధన్యుం డొంటిమై భూతలం
బున వర్తింపుచు శంకరుం దలఁపుచున్ ముక్తాత్ముఁడై కర్మజా
లనిరాసం బిముఁ జూల్కొన న్సురభిమల్లా వైదుషీభూషణా. 89

మ. ఒకచో నిల్వక పాణిపాత్రహృతనిత్యోదాత్తభిక్షాన్నుఁడై
సకలంబు న్మదిలోఁ దృణోపమముగాఁ జర్చింపుచు న్యోగిభా
వకుఁడై కాంచునఖండబోధసుఖజీవన్ముక్తి చంద్రార్ధచూ
డకృపం గాని జనింప దౌ సురభిమల్లా వైదుషీభూషణా. 90

## అవధూతచర్య.

మ. అనిశస్స్వైరవిహారుఁడై సతతభిక్షాహారుఁడై శూన్యకా
ననదేశైకశయాళుఁడై శిథిలకంథాజీర్ణకౌపీనుఁడై
ఘనయోగస్థిరుఁడై ప్రశాంతుఁ డయి వేడ్కన్ సర్వవిజ్ఞాని శే
ల నగారిప్రముఖోన్నతు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 91

మ. అలఘుజ్ఞానసమగ్రుఁ డౌ విబుధుఁ డాహా పద్మగర్భాండమం
డలమాత్రంబున కేల నాసపడు నానాశైలసంవాస మా
జలధిశ్రేష్ఠము చేఁప గంతు లిడినన్ సంక్షోభముం జెందు నే
లలనానూతనమన్మథా సురభిమల్లా వైదుషీభూషణా. 92

మ. సపరిస్ఫూర్తపలాశపాత్రమున భైక్షం బెత్తి తద్గ్రాసభు
క్తిపరుం డౌనవధూతశేఖరుఁడు లక్ష్మీ తల్లి యొం దేని నీ
కృప వే ఱొక్కెడ నిల్పు నిస్పృహుల మాయే మొల్ల మే మొల్ల మం
చపరాగస్థితి భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 93

మ. నవతల్పం బిల దివ్వె చంద్రుఁడు వితానం బాకసం బంచితం
బవువింజామర మందవాత ముపబర్హం బాత్మహస్తంబు నై
సువిరక్తిం బ్రియభామఁ గూడుకొని రాజుం బోలి సమ్మాతితో
నవధూతేంద్రుఁడు భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 94

శా. హానాదానవిరక్తమార్గనిరతుండై గ్రామరథ్యాచల
న్నానాచీరసులబ్ధకంథుఁ డయి శాంతస్వాంతుఁడై భిక్షుఁడై
మానాహంకృతిశూన్యుఁడై జనపతిం బ్రాపింప కాత్మేచ్ఛ బో
ధానందుం డిలఁ గ్రమ్మరు న్సురభిమల్లా వైదుషీభూషణా. 95

మ. జడుఁడో భిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానాఢ్యుఁడో సిద్ధుఁడో
కడవాఁడో యనుచున్ జను ల్వారిఁబోరిన్ గన్గొంచు భాషింపఁగా
నుడువం డల్గఁడు సంతసం బిడఁడు తన్నుం గానియ ట్లుర్వి న
ల్గడ యోగీంద్రుఁడు క్రమ్మరు న్సురభిమల్లా వైదుషీభూషణా. 96

మ. సతతంబు న్శుచిగా నయత్నత నహింసాసాధ్య మాఘూసవా
యుతతి న్మేసి మహీశయాళు వగు నేణోరంగమశ్రేణియూ
కృతి యోగీంద్రుఁడు దాల్చు నవ్విదువు ధాత్రి న్సర్వధర్మోత్తమం
బతులాచారధురంధరా సురభిమల్లా వైదుషీభూషణా. 97

బాలమృణాళతంతువునఁ బన్నగరాజముఁ గట్టఁబోవు వ
జ్రాలకు బెజ్జముల్ నుసువఁజాలుశిరీషసుమాంతసంహతిన్. 5

చ. పరమహితంబుగాఁ దగుసుపాయముగా ననిశం బధీనమై
పరఁగెడునట్టు లజ్ఞతకు బల్వగుకప్పడ మొప్పఁజేసె ము
న్సరసిజగర్భుఁ డెట్లనిన సర్వమెఱింగినవారిరచ్చలం
దెఱుఁగనివారి కాభరణ మెంచ విశేషపుమౌనమేకదా. 6

చ. ఎపుడొకయింతగంటినని యేనుఁగురీతి మదించి యుంటినో
యపుడె సమస్తవిత్ప్రభుఁడనైతి నటంచు మదించె నామనం
బిపుడొకయించుకించుక బుధేంద్రులచెంత నెఱింగికొంటినో
యపుడె విమూర్ఖతాత్తదురహంకృతిపీడె జ్వరంబుకైవడిన్. 7

చ. తొరగెడుజొల్లున న్నడిసి దుష్టపుకంపునఁ జేరరాక లోఁ
బురువులు గాఱ నంజుడును పోడిమిలేనినరాస్థిఁ జొక్కుచు
న్గొఱికెడుకుక్క పార్శ్వమునకు న్జనుదెంచిన యింద్రుఁ గాంచిన
న్వెరయదు శంక తుల్లకులు పొందిన తక్కువలెక్కసేతురే. 8

చ. సురపురినుండి శంకరునిజూటము జూటము వాసి గట్టు గ
ట్టురువడిపీడి భూమి భువినుండియు వారిధి వార్ధి నిల్వ క
య్యురగులలోకము న్బొరసియు న్నెఱసె న్మఱిగంగగావున
న్దొలకులు స్థానము ల్విడిచి నూఱుముఖంబుల గాసిఁజెందరే. 9

... ... ... ... ... 10

## విద్వత్పద్ధతి.

చ. సురుచిరశాస్త్రపాఠపరిశుద్ధవచస్కులు శిష్టదేయసు
స్థిరనిగమాగము ల్గడుఁ బ్రసిద్ధులు సాధను లేన్రపాలుచేఁ
బొరసిరొ లేమి యక్కొదువ భూపతిదే ఘనులైనవారిలే
మరసి పరీక్షకుండు వెలయల్పముసేసిన రత్న మల్పమే. 11

చ. కనఁబడ దెవ్వ రేఖిలిమిఁ గైకొనవచ్చిన నిచ్చలున్ సుఖం
బెనయఁగఁ జేయు నర్థులకు నిచ్చిన హెచ్చు యుగాంతవేళలం
దును జెడ దట్టివిద్యయను నూత్నధనంబు గడించికొన్నవా
రిని సవరింపనేరని కుభృత్తులతోడ విరోధమేటికిన్. 12

చ. అధిగతవేదశాస్త్రపరమార్థులఁ బండితులైనవారి నీ
వధిప! నిరాకరింపవల దల్పతృణోపమ నీదులక్ష్మి య

య్యధికుల నడ్డగింపఁగలదా మదవార్యసితోరుగండభా
ష్కధరనిభేభరాజములకుం బిసతంతు వదేమియడ్డమో. 13

చ. అలకమలాసనుండు మది నల్కవహించిన నేని యంచపై
లలితసరోజినీవనవిలాసనివాసము మాన్పఁగాకఁ దా
బలియుఁడనంచు దానిదగు పాలును నీరును నేర్పరించు నే
ర్పులగల సుప్రసిద్ధయశము న్హరియించుటకు న్సమర్థుఁడే. 14

చ. జలకము గంధముల్ గుసుమచారుశిరోజములుల్ భుజాంగదం
బులు శశిగౌరహారముఖభూషలు మర్త్యు నలంకరింప వే
వలర నలంకరించు విమలాంచితసంస్కృతవాణి యొక్కటే
బొలుపఱు సొమ్ములెల్ల చెడిపోవదు వాక్కనుభూషణం బిలన్. 15

చ. నరులకు దాచిపెట్టినధనంబును చక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖకారిణియున్ గురుకోటికి న్మహా
గురువు విదేశబంధువును గూర్చినదైవము రాజవశ్యమున్
వెరవు సువిద్యయే ధర నవిద్యుఁడె పో పశువర్గ మిట్టిదే. 16

చ. క్షమ మదినున్న నేల కవచం బరియేటికి క్రోధమున్న దా
యమలయ నేల చిచ్చు పరమౌషధమేల సువృత్తు గల్గ మూ
ర్ఖమనుజుఁడున్న నేల ఫణి ద్రవ్యమదేల సువిద్యయున్న సి
గ్గమఱిన సొమ్ములేల కవితాఢ్యతగల్గిన రాజ్యమేటికిన్. 17

చ. పరిజనకోటిపైఁ గరుణ బంధులపై మొగమోట మల్పులం
దరతియుఁ బ్రీతి సాధుజనులం దిల ఖలునియెడ న్నయంబు తెం
పరులపయిన్ బుధాళియెడ నార్జవమున్ గురులందు నోర్పు బి
త్తరులెడ ధూర్తతం దెలుపు ధన్యులయందె తగు న్జగద్గతుల్. 18

చ. మతిఁగల జాడ్యము జ్జెఱచు మాటల సత్యము గూర్చు మాన ము
న్నతి నెనయించుఁ బాపములు నాశమొనర్చు మనంబున న్ప్రస
న్నత గదియించు దిక్కుల ఘనంబుగఁ గీర్తులు నించు సాధుసం
గతి యిఁక నేవిశేషములు గల్గఁగఁ జేయదు మర్త్యకోటికిన్. 19

చ. చతురమతిప్రసిద్ధియుఁ వచఃపరిశుద్ధి ప్రబంధవర్ధన
స్థితికలనాసమృద్ధి రససిద్ధియుఁ గాంచి యగణ్యపుణ్యభా
గతులితకీర్తి దేహధరులై సుకవీశ్వరు లెయ్యెడ న్జరా
మృతిజనితోగ్రభీతులు వహింపక యిప్పుడు నున్నవారిలన్. 20

## శౌర్యపద్ధతి.

ఉ. ఆఁకటఁ బ్రుక్కిన న్ముదిమి నంగము జిక్కినఁ గష్టదుర్దశ
లోఁకినఁ గాంతి దక్కిన నసువ్రజము ల్జనుచున్న దస్సిన
స్వీక మదేభకుంభపదవీపిశితస్పృహఁ జెందు సింగము
ప్రాఁకట వాఁడుపు ల్మిసవుచా యభిమాని మృగేంద్రుఁ డెయ్యెడన్. 21

ఉ. స్నాయువసాదు లల్పములు నంజుఁడు లేదవి పంకదూష్యమా
హేయపుటస్థిఁ గుక్క భుజియించుచు రంజిలు దాన తృప్తినుం
బాయదు ప్రాప్తజంబుకము మాని మృగేంద్రము గెంచు నేనుఁగుఁ
డాయుచు రెల్లవార లతిడస్సియు శక్తికొలంది కోరికల్. 22

చ. బలువిడి తోఁకఁ ద్రిప్పి పతిపాదము లూనుచుఁ గ్రింద వ్రాలుచు
న్వొలికిల నేలపైఁ బడుచు వేమఱు నోరుదరంబె చూపుచు
న్బెలుకురు కుక్క కొక్కడి బెట్టరు ధీరతఁ జూచుచుఁన్ మదా
వళము భుజించుఁ జాటు శతవాక్కులసెన్నవణంబు లిమ్ములన్. 23

చ. ఎడతెగకిట్లు సంసరణ మెల్లపుడుఁ బరివర్తిలంగ నే
యొడ మృతిబొంది యెవ్వఁ డుదయింపఁడు పుట్టుక కేమి యెవ్వఁడీ
పుడమి జనింపఁ దత్కులము భూరిసమున్నతిఁ జెందువానిదే
యొడలును జన్మము న్బరువు లొక్కొకచోఁ బదికోట్లు పుట్టవే. 24

ఉ. మాసరవాసనైకకుసుమస్తబకాకృతి రెండువృత్తుల
న్బాసిలు మానశాలి యగుప్రాజ్ఞుఁ డదెట్లనఁగాఁ బురంబుదాఁ
జేసినసర్వలోకములుఁ జెల్వుగ నౌదలదాల్పనుండు న
య్యాసలు బాసిన న్దపసియై వనసీమల నుండు నెమ్మదిన్. 25

చ. అలగురుభార్గవప్రభృతు లైదుగురు న్మరువొంద వారిపై
నలుగక శీర్షమాత్రయుతుఁ డయ్యును జూడు విశేషవిక్రమే
చ్ఛలు గలరాహుదైత్యపతి చంద్రదినేంద్రులఁ బట్టు నిర్వార
జ్జలమునఁ బర్వవేళల యశంబున కింతె మహద్విరోధమున్. 26

చ. ఘనుఁ డహిభర్త భోగఫలకంబునఁ దాల్చు జగంబులెల్ల నా
యన నలకూర్మరాజు చరమాంగమున న్భరియించు నాగునా
థ్యుని ధరియించు ఘోణిమణి యూనుఁ దదంగభరంబ నాదృతి
న్వనధి యయూశె యార్యులయుదార్యచరిత్రము లౌ విచిత్రముల్. 27

ఉ. ఆకడఁ దండ్రి క్లేశవశుఁడై కృశియింపఁగఁ గాంచుచున్న పై
నాకునకు న్బయోధి భువనంబులఁ గూలుట నర్హ మాసడిం
జేకొనకంటె దృప్తసురశేఖరభూరిశిఖిస్ఫులింగకీ
లాకరభీకరోరుకులిశాహతిఁ జచ్చినఁ గీర్తి గల్గదే. 28

చ. కరముఁ బ్రకాశమొందురవికాంత మచేతన మయ్యుఁ జూచితే
యొరపరికంబు కోప మొకయించుక భానుఁడు పాదమూదినన్
గఱకఱిఁ జెందినట్టు లధికజ్వర మండెడుజండజేజముల్
బొరసినపూరుషుల్ పరులు బూని యొనర్చునవజ్ఞ లోర్తురే. 29

ఉ. సింగముగన్న యక్కొదమ చిన్నదియయ్యు నభంగవాసనా
సంగతభృంగదానఝరసంఘమలీమసగండరంగమా
తంగవిభంగభంగులకు దాఁటు బలాఢ్యులకున్ స్వభావమీ
యంగు వయోవిశేషము పరాక్రమసంపదకున్ బ్రధానమే. 30

---

## అర్థపద్ధతి.

చ. కులము రసాతలస్థలిని గూలిన మంచిగుణం బధోగతిం
బొలసిన శీలమద్రితటభూమిని జాఱి విదగ్ధమైన ద్వి
ట్కులహరశౌర్యమందుఁ బిడుగుల్ పడినన్ గడుమేల్ ధనంబె కా
వలె నది లేనిచోఁ దృణలవంబులుగా గుణకోటు లిన్నియున్. 31

ఉ. వాఁడె కులీనుఁ డుత్తముఁడు వాఁడె రసజ్ఞుఁడు వాఁడె యార్యుఁడున్
వాఁడె బహుశ్రుతుండు మఱి వాఁడె గుణాఢ్యుఁడు వాఁడె వక్తయున్
వాఁడె సురూపియంచు ధనవంతుని నందఱు నెంతు రెంతయున్
బోడిమిగాన సర్వగుణముల్ గనకాశ్రయభూతము ల్గదా. 32

చ. కుమతులయోచనన్ నృపతి కూటమిచే యతి లాలనన్ సుతుం
డమహితవిద్య విప్రుఁడ సదాత్మజుచేఁ గుల మల్పుచే సుశీ
లము త్రపహేలచేఁ గృషి యలక్ష్యతఁ జెల్మి ప్రవాసవృత్తి వి
య్యము రతిదుర్ణయాప్తి సిరి యర్థము లీవిఁ బ్రమాదతన్ జెడున్. 33

చ. అనుపమదానభోగవిలయంబు లన న్దగు మూఁడుమార్గముల్
దనరు ధనంబునకీ దది యుదారమతిన్ మనుజుం డెఱింగి దా
ననుభవి గావలెన్ బుధుల కర్థుల కీవలె లేక మూలయిం
టనె పెనుకాంక్ష దాప నది దక్కదు మూఁడవత్రోవఁ బైకొనున్. 34

ఉ. శాణవిలీఢరత్న మరిసందళితాంగజయాఘన్యోఁడుక్ మద
క్షీణగజంబు నిర్జలవిశీతలసైకతశారదాపగా
శ్రేణి కళావశిష్టశశి చెల్వనిచే రతిఁ దక్కుబాల వి
శ్రాణనలీలఁ జేదగిలురాజులు మింతురు కార్శ్యమొందియున్. 35

ఉ. చేరెడుగంజికోస మొరుచెంగటి కేగుచు దన్నియున్నవాఁ
డే రమ జెంది వెన్క జగమెల్లఁ దృణంబుగ నెంచు నర్థముల్
మీఱిన యందునన్ దుదను లేక యణంగినయందున న్నరుల్
జేరును బెక్కవస్థలు గ్రహించుట మించుట దానసేకదా. 36

ఉ. తడవ నిబద్ధి యొక్కపుడు దబ్బఱ యొక్కెడ నిష్ఠురోక్తు లొ
క్కెడఁ బ్రియవాద మొక్కపుడు హింస యొకప్డు దయాశుభావ మొ
క్కెడ ధనకాంక్ష యొక్కపుడు నిచ్చుట యొక్కెడ వెచ్చ మొక్కెడన్
గడన యొకప్డుగా గణికకైవడి నాన్నృపనీతి నైకతన్. 37

ఉ. ఇలయనుధేనువు న్పిదుక నిచ్ఛజనించిననేని రాజ నీ
వెలమిని దూడఁ బెంచినటు లెప్పుడు లోకముఁ బ్రోవవయ్య నీ
వలన జనంబు లెస్సయయి వర్ధిలుచుండినఁ గల్పవల్లియుం
బలె సకలేప్సితార్థఫలవర్గము లీధర యీనకుండునే. 38

ఉ. భూరితరాజ్ఞకీర్తియును భూసురరక్షయుఁ బాత్రదాతయై
మీఱుట భోగమొందుటయు మిత్రులఁ బ్రోచుట నాఁగనొప్పనీ
యాఱుగుణంబు లేనృపులయందు రహింపవొ వారి నూరకే
యూరడిఁ గొల్వనేల గలదా ఫల మాశ్రితకోటి కెంతయున్. 39

చ. వనజభవుండు మున్నొసటవ్రాసినదెంతయొ యొంతకొంచమో
ఘనమొ సురాద్రి నున్నమరుభూమ్ముఁ జేరిన వచ్చు హెచ్చు రా
దనఘ వృథావ్యథ ల్గనకు మాధ్యులచెంత ధగింపు ధైర్య మూ
నిన ఘటి కెచ్చునే జలము నీరధి ముంచిన నూత ముంచినన్. 40

---

## దుర్జనపద్ధతి.

ఉ. కారణ మింతలే కొకరిఁ గాంచినఁ గిన్కవహించు టాత్మని
ష్కారుణికత్వ మొందు టొరుకాంతఁ దలంచుట లన్యవిత్తముల్
గోరుట బంధులు న్సుజనులు న్గను మేలు సహించకుండుటల్
క్రూరవిచారు లౌనరులకున్ మృషగాదు స్వభావసిద్ధముల్. 41

చ. లలితకళావిలాససమలంకృతుఁ డైనను దుర్జనుండు చెం
తల వసియింపఁగాఁ దగఁ డనర్హుఁడు వానిఁ ద్యజింపనే తగున్
గలితనవారుణారుణధగద్ధగితోరుఫణామణిప్రభల్
గలవని చెంతనున్న భయకంప మొనర్పదె సర్ప మేరికిన్. 42

చ. త్రప జడవృత్తి సద్వ్రతము దంభము శుద్ధత మైదుబంటు ని
ష్కృపుఁడు గురుండ బుద్ధిప్రియరీతులు పల్కుట దైన్యవృత్తి తే
జపుఁబస గర్వమౌ స్థిరుఁ డశక్తుఁడు వక్త బహుప్రజల్పుఁ డం
చెపుడును నిందసేయు ఖలుఁ డేసుగుణం బిఁక వాఁడు మెచ్చునో. 43

చ. అవగుణమేల లోభ మెనయన్ గొలలేటికి గొండెమున్న స
త్యవచన మున్న నేల తప మాత్మశుచింగన దీర్థమేల మే
లవు సుజనత్వమేల సుగుణాళిమహత్వమె చాలు సొమ్ములే
ల విభవమేల విద్య ప్రబలన్ సడిఁ జెందిన మృత్యు వేటికిన్. 44

చ. పగలిఁటఁ గాంతిలేనిశశి పాయముదీఱినభామ పద్మనిం
దగులమి రిత్తయౌ కొలన నక్షరరూపవదాస్యమున్ ధనా
శగలప్రభుండు లేమి ననిశంబు గృశించుబుధుండు భర్తయో
లగమున నుండుసూచకుఁ డిలన్ విడఁగూడని సప్తశల్యముల్. 45

ఉ. ఆతతచండకోపదహనాక్షయరూక్షకటాక్షు లైనధా
త్రీతలనేతలందుఁ గలదే తనవారను ప్రీతి తప్పినన్
ఘాతయ సేయఁజూతు రధికత్వర మండెడువహ్ని వ్రేల్చుచో
హోతనటంచు నంటుకొన నోరిచి శీతలవృత్తిఁ జూపునే. 46

ఉ. ఊరకయున్న మూఁగ వచనోద్ధతిఁ జూపిన గొంటు చేరువన్
జేరిన దంట దవ్వుల వసించినచో నసమర్థుఁ డోర్పుతో
నోరిచికొన్న భీరుఁడు దురుక్తులు సైఁచిన జాతిహీనుఁ డం
చారడిఁబెట్టు రాజు వశమా నృపసేవ యగమ్య మేరికిన్. 47

చ. సకలబలావళిన్ బ్రియమెసంగఁ బ్రకాశమొనర్చి హెచ్చి పా
డికిఁ జొరలేక తాముసు ఘటించినదుష్టతమాధమక్రియా
ప్రకరము లన్నియున్ మఱచి భాగ్యముచే సిరిఁ జెంది సర్వదా
మనుఁ దగుదుష్టదృష్టిఁ బడి సౌఖ్యము లెవ్వరు గందు రిమ్మహిన్. 48

ఉ. హెచ్చిలు దొల్త పిమ్మట క్షయించును రేపటిపూఁటనీడ నాఁ
గుచ్చితుచెల్మి దొల్త గడుఁ గొంచెమ యై మఱి మీఁద హెచ్చుచున్
వచ్చు వివేకిమచ్చిక ధ్రువంబుగ మాపటిపూఁటనీడ నా
నిచ్చలు నిత్తెఱంగెఱిఁగి నెయ్యము సేయఁదగు న్వివేకితోన్. 49

ఉ. నీరముఁ బూరి సంతసము నిచ్చులు జీవనమై పొసంగ నె
వ్వారికిఁ గీడు సేయకఁ బ్రవర్తిలు మీనమృగార్యులందు ని
ష్కారణవైర మూనెదరు కష్టులు దాశకిరాతసూచకుల్
వారిజగర్భుకట్టడయొ వారిదయారహితస్వభావమో. 50

---

సుజనపద్ధతి.

చ. పరగుణరీతిఁ బ్రీతి గురుపట్ల వినీతి బుధాప్తివాంఛయుం
దఱచుగ విద్యనాస్థయు సధర్మిణిపై రతి లోకనిందలన్
వెఱపు శివార్చభక్తి మతి నిగ్రహశక్తియు దుష్టసంగమం
దరతియుఁ గూర్చి యొప్పెడుమహాత్ములఁ గూర్చి నమస్కరించెదన్. 51

ఉ. ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పుఁ బౌరిషవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్ప బ్ర
జ్ఞాపరు లొప్పుచుందు రివి సాజములై తమయందుఁ బొంపఁగన్. 52

చ. కరమున శ్లాఘ్యదాన మెసఁగన్ దల శ్రీగురుపాదవందనం
బొరయ ముఖంబు సత్యరమఁ బూన జయాస్పదవృత్తి బాహులన్
మెఱయ మహోచ్చవృత్తి మది మించ శ్రోత్రంబు శ్రుతిద్వయిన్ దగన్
సిరులు వినా విభూషలుగఁ జేయుదు రీగుణముల్ మహామహుల్. 53

చ. ఒకరిధనంబుఁ గోరకన్నృతోక్తులు బల్కక పథ్యమైనఁ జం
పక తగువేళ నీవి కలమాత్రము మానక నన్యుఁ గూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతికాంక్షల గూడక భూతమైత్రిఁ బా
యక నరుఁడున్న మంచితెరువంచు శ్రుతుల్ స్మృతు లెంచు నెప్పుడున్. 54

ఉ. సంపదఁ గన్నవేళ గుణశాలులచిత్తము గూరవృత్తి వ
ర్తింపక నూత్నపల్లవశిరీషసుమోత్పలకోమలస్థితిన్
సొంపువహించు నాపదలు సోఁకినవేళ విశాలశైలని
ష్కంపతటస్థలస్ఫురదఖండశిలాకృతి కర్కశంబగున్. 55

చ. నయగతి బ్రీతి ప్రాణములు నాశిలినన్ మలినత్వ మింతలే
మియుఁ ఖలులన్నఁ జేరమియు మిత్రుల నొచ్చియుఁ వేడఁబోనితే
న్కియుఁ వెతలందుఁ దాల్మియు మనీషులజాడ మెలంగుటల్ బుధా
శయములు కత్తిమీఁదిపెనుసాము లివెవ్వరిచేత నేర్చిరో. 56

ఉ. ఎంతయినన్ సుగుప్తముగ నిత్తురు సజ్జను లిల్లుఁజేరఁ బూ
జింతురు ప్రీతిఁ జేసినది సెప్పరు మేల్ సభనెంతు రన్యుమె

ప్పింతన కుగ్గడింతు రనయింతురు శ్రీగలగర్వమంచిత
స్వాంతులు కత్తిమీఁదిపెనుసాము లివెవ్వరిచే నెఱింగిరో. 57

చ. బలువుగఁ గ్రాఁగునయ్యినుముపైఁ బడుతోయకణంబు నాశిలున్
బొలుపరి తామరాకుపయి ముత్యమురూపున నిల్చుఁ గొంతసే
పల జలబిందువే యుదధియందలి శుక్తిని వ్రాలి ముత్యమై
మలయును తత్సమం బధమమధ్యమసత్తమసఖ్యముల్ క్రియల్. 58

చ. తగునడవళ్లఁ దండ్రికి ముదం బొదవించినవాఁడె పుత్త్రుఁడున్
మగనికి సంతసంబెసఁగ మక్కువఁజూపినదే పురంధ్రి ప్రే
మ గలిగి కల్మిలేముల సమంబుగ వర్తిలువాఁడె మిత్త్రుఁ డీ
ముగురు లభింతు రచ్ఛమతి మున్ సుకృతంబు లొనర్చువారికిన్. 59

చ. ఒరులకు నమ్రులై ఘనత నొంది పరస్తుతి నాత్మసద్గుణ
స్ఫురణ వెలార్చి యన్యుపనిఁ బూనియు స్వార్థములు న్వహించి ము
ష్కరులదురుక్తియుక్తు లతిశాంతిని మార్చి తదార్తికారులై
యరుదగుచర్యల న్మెలఁగు నార్యులు పూజ్యులు గారె యేరికిన్. 60

---

## పరోపకారపద్ధతి.

చ. ఫలములఁ బిక్కటిల్లియును బాదపముల్ గను నమ్రభావమున్
జలధరపఙ్క్తి దవ్వుల నెసంగియుఁ నమ్రత నిచ్చుఁ దోయముల్
కలిమిఁ జెలంగియున్ ఘనులు గర్వముఁ జెందక యుందు రింతయున్
దలఁపఁ బరోపకారులగు ధన్యులకైన స్వభావకృత్యముల్. 61

చ. చెవు లురుకుండలద్యుతులచేతను గాదు శ్రుతి న్వెలుంగు ర
త్నవలయయుక్తి గాదు కయి దానముచేఁ జెలఁగున్ దయామతిన్
సవురగువారిదేహములు చందనకుంకుమచర్చచేతఁ గా
దవనిఁ బరోపకారమహిమాతిశయంబునఁ జాల శోభిలున్. 62

చ. జలజపరంపరన్ సురుచిసంపద నింపు నినుండు కైరవో
త్పలనికరంబుల న్గరము భాసిలఁ జేయు సుధాంశుఁ డంబుదా
వళి తనయంతఁ దాఁ గురియు వర్షము హర్షముఁ జెంద లోక మి
ట్లలఘుమతుల్ స్వయంగతపరార్థహితుల్ సుకృతుల్ దలంపఁగన్. 63

చ. ఒరులపనుల్ ఘటింతురు నిజోద్యమముల్ ద్యజయించి యుత్తముల్
పరులపనుల్ స్వకార్యములు బాయక పూనుదు రుర్విమధ్యముల్
పరహితముల్ నిజార్థరతి భగ్న మొనర్తురు మర్త్యరాక్షసుల్
పరహిత మూరకే చెఱచుఁ బామరు లెవ్వరొ తోఁచ దాత్మకున్. 64

ఉ. పాపము సేయనీఁడు హితపద్ధతిఁ గూర్చు రహస్య మాపనుల్
దాపనుఁజూచు సద్గుణవితానము లందఱెఱుంగ నెంచుఁ దా
నాపదవచ్చిన న్విడువఁ డక్కఱవేళల నిచ్చుఁ దీర్చు సం
తాపము మంచిమిత్త్రుఁ డని తద్గుణముల్ బుధు లెంతు రెంతయున్. 65

చ. తనుఁ గలసెన్ జలంబులని దానికిఁ బాల్ స్వగుణం బొసంగి వెం
టనె యది గావఁగాఁబడునెడన్ జల మోర్వకఁ గాఁక నింకె న
య్యనుఁగువిపత్తు సైఁపక మహాగ్నిఁ బడంగఁ దొడంగెఁ బాలు గ్ర
క్కున జలమంతలోఁ గలయఁ గ్రమ్మఱ నిట్టివి సాధుమైత్రులున్. 66

ఉ. ఇందె శయించినాఁడు కమలేశ్వరుఁ డిందె వసించెఁ దద్విప
ద్బృందము లిందె చెందె శిఖ రిచ్ఛటలున్ శరణంబు బాడబం
బుం దగ నిందె యిందె ఘనపుష్కలముఖ్యములున్న వద్దిరా
యెందునుఁ గాన మెంతబరు వీజలధింప్రనిమేను బూనెడిన్. 67

ఉ. ఆతతలోకధారిచరమాంగలసత్కమఠేంద్రుఁ డొక్కఁడే
జాతుఁడు జన్మమన్న ధ్రువుజన్మమె సద్గ్రహచక్రవర్తన
స్ఫీతత క్రిందమీఁద హితశీలులుగానిజడుల్ వృథాభదా
బ్జాతభవాండభాండఫలజంతుసముల్ మృతజాతులేటికిన్. 68

ఉ. ఆస నడంపు మూను క్షమ యూనకు గర్వము నాఁడు సత్యమే
దోసము సేయఁబోకుము బుధు ల్సనుత్రోవనె పొమ్ము విద్వదు
ల్లాస మొనర్పు ముగ్రరిపులన్ శమియింపు వహింపు కీర్తి సం
త్రాసులఁ బ్రోవు సద్గుణము దాపు మివేకద సాధుకృత్యముల్. 69

చ. మనసులు వాక్కు లంగములు మానితపుణ్యసుధాప్రపూర్ణతం
దనర నిజోపకారు లుదితత్రిజగజ్జనులై పరు ల్భరిం
చినపరమాణుమాత్రగుణశీలము లద్రులుచేసి హర్షతో
యనిధుల నోలలాడుచు మహామహు లుందురు కొంద ఱిద్ధరన్. 70

---

## ధైర్యపద్ధతి.

చ. అమరులు వార్ధిఁ ద్రచ్చునెడ నందుదయించినరత్నపాళి హ
ర్షము గన రాహాలాహలవిషంబున భీతి వహింప రాత్మన
య్యమృతముఁ గన్నదాఁక విడ రప్పని యేతెఱఁగైన ధీరస
త్తములు సునిశ్చితార్థ మవుదాఁక ప్రయత్నము మాననేర్తురే. 71

ఉ. ఊనిన నేడ విఘ్నమగునో యని నీచులు భీతిఁ గార్యమే
పూనరు మధ్యముల్ దొలుతఁ బూనియుఁ బూనక విఘ్నమైనచో

మానుదు రెన్నివిఘ్నములు మాటికివచ్చిన నెంతనొచ్చినన్
మానరు తాము బూనిన సమంచితకార్యము ధీరమానసుల్. 72

చ. ఒకయెడ భూమిసే బరుఁడు నొక్కెడఁ బాన్పుననుండుఁ గూరలే
కొకయెడ మెక్కు లోఁగొను రసోదనమొక్కెడ బొంతఁ బూను నై
నొకయెడఁ గట్టు దుప్పటము లొక్కెడఁ గార్యభరార్థికిన్ మన
స్వికిఁ గలదే సుఖాసుఖవిశేషవిధాగణనాప్రసంగముల్. 73

ఉ. నీతు లెఱుంగువారు తమనింద ఘటించిన నెంచినన్ మహా
భూతులు బాయకున్న నవి బోయిన చావపుడైనఁ గల్పసం
ఘాతవిరామకాలములఁ గల్గినఁ గల్గెడుగా కొకప్పుడున్
నీతిపథంబునం జెదరనేరరు ధైర్యరమాధురంధరుల్. 74

చ. యువతికటాక్షవీక్షణశరోద్ధతి ప్రక్కలుగా కురుక్రుధా
పవనసఖోపతాపములఁ బాకముచెందక లోభపాశము
న్దవులక దుర్వ్యథాస్పదపృథగ్విషయాశల గాసిఁ బొందకే
యవిరళపుణ్యబుద్ధిఁ దగునాతఁడు గెల్చు సమస్తలోకముల్. 75

ఉ. ఎంతదురంతచింత ఘటియించియు ధీరునియంతరంగసం
క్రాంతనితాంతధైర్యరమ గ్రాఁప నశక్యము ప్రజ్వలచ్ఛిఖా
వంతు నొకింత క్రిందుగను వంచిన వంచఁగవచ్చుఁ గాక దు
ర్దాంతతదంతరస్ఫురదుదగ్రశిఖావళి వంపఁగూడునే. 76

చ. హిమగిరితుంగశృంగమున కెక్కి తదుగ్రతటస్థలంబునన్
దుమికిన మేలు తద్విషమదుష్టశిలాహతి మేను ప్రయ్యనై
న మఱియుం మేలు వ్యాళవదనంబునఁ గే లిడుకొన్న మేల్ శిఖిం
గుమిలిన మేలటంచు ననఘుల్ విడజాలరు శీలసంపదన్. 77

చ. జ్వలనుఁడు తోయమా జలధి స్వల్పపుకాలువఁ బోలు కొంచమా
శిలయగు కాంచనాచలము సింహము లేడియగున్ మహోరగం
బలరులదండయా విషముఁ ద్రావ సుధారసమా జగద్ధితా
కలితసుశీల మేఘునునికాయమునం దగు నట్టిమేటికిన్. 78

చ. అసదృశసద్గుణాస్పదయు నార్యయు నిర్మలచిత్తయైనత
ల్లి బరిగఁజూచి లజ్జ విడలేక భరించిన సూనృతవ్రత
వ్యసనులు దీప్రతేజులు నిజాసుచయంబయినన్ సుఖంబుగా
ముసలక మాననొప్పుదురు మానగలేరు కృతప్రతిజ్ఞలన్. 79

చ. కలిమికి సజ్జనత్వము పొగడ్తకుఁ బూనమి బల్మి కోర్చుట
తెలివికి విద్యయున్ వినయదృష్టి ధనాప్తికిఁ బాత్రదానమే

యలుగమి సత్తపస్యకు మహాప్రభువృత్తికిఁ దాల్మి ధర్మిక
చ్ఛలతవిభూషణంబు లగు సర్వగుణాద్యము శీలమే సుమీ. 80

---

## దైవపద్ధతి.

చ. గురుఁడు ప్రబోధకుండు దశని ఘోరపువా లమరుల్ స్వసైనికుల్
పురి దివి దంతి యభ్రకరి పోరసహాయుఁడు దైత్యభేది, యి
ట్లురుదగు బల్మి గల్గియు బలారి బలారిపుఘాటి కోడెఁ దే
శరణము దైవమే పురుషశక్తి వృథా యదియేల కాల్పనే. 81

చ. అసువుల నాసగ్రుంగఁ దనువంతయుఁ బెద్దమునుంగ నింద్రియో
ల్లసనమణంగ నాఁకట నలంగుచు నోటన రేయి యెల్కబె
ట్టెసరఁగఁ దానపడ్డలరి డిగ్గన లోఁగాను భోగి తత్పుషన్
వెసఁ జను దైవమిచ్చు క్షయవృద్ధుల స్వస్థతనుండుఁడీ జనుల్. 82

ఉ. లేవడి బొందియుండె వెతల లీనత బొందియు లేచు గ్రక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదారతఁ గందుకవృత్తి హత్తి దు
ర్భావుఁడు తద్విధంబున విపద్దశవచ్చిన నొచ్చి నాశిలున్
లేవక మంటిముద్ద ధరణింబడి యట్టియణంగుకైవడిన్. 83

చ. వడి నెద నెండ బట్టతలవాఁ డొకఁ డెండను నెత్తిమండ నల్
గడలను నీడచోటరసి కానక దవ్వుల తాటిచెట్టు గ
న్పడఁ జని క్రింద నిల్వ నల పండు వడన్ దల బ్రద్దలయ్యె నె
య్యెడలకుఁ జన్న దైవహతు నించుక డించక ముంచు నాపదల్. 84

చ. గజభుజగంబులం బలుబిగంబుల గట్టుట సూర్యచంద్రులన్
గజిబిజిచేసి దుర్గ్రహము క్రౌర్యమున న్గబళించి యేచుటల్
బుజుమతు లౌమహాత్ములు దరిద్రత వేగుటఁ జూచి యయ్యయో
నిజగతి నెంత చేసె నతినిష్ఠురదైవ మటంచుఁ గుందుచున్. 85

చ. సరసగుణాఢ్య శేమగుణసంపద నిల్వ నిధానమౌ మహా
పురుషశిఖామణిన్ భువికి భూషణరాజముగా సృజించి య
త్తఱి క్షణభంగురంబుగను వాని నొనర్చినయేని యేటికే
ర్పరి విధి యాతఁ డూనిన యపండితభావము కష్ట మక్కటా. 86

చ. అతులసుధారసైకనిధియై సకలౌషధులెల్లనాథుఁడై
శతభిషగన్వితోద్గమనసంభృతుఁడై శివమౌళిభాగలం
కృతమణియై వెలుంగుశశి యెప్పుడు బాయఁడు రాజయక్ష్మ హా
హాతవిధిపాక మేదొరలకైనను దాఁట నలంఘ్యమే కదా. 87

చ. హతవిధి యస్తులాలవరుఁ డాత్మ యనందగుమృత్తికన్ బలో
ద్ధతిఁ గొని ముద్దచేసి వ్యథ యన్ భృఘుచక్రముఁ జేర్చి యాపదు
న్నతఘనదండఘాతన మనంబును బల్మఱు ద్రిప్పుచున్నవాఁ
డతఁ డిఁక నేమిసేయునొకొడా చేఁకొఁడ యెఱుంగ వేమియున్. 88

చ. చెడుపనులానియే యలఁతఁ జెందెద వీయడియాస మాను మో
జడవిధి యాపదల్ వెనిచి సాధులధైర్య మడంపఁ బూనినన్
జెడదది కల్పసంక్షయవిశీర్ణనిజక్రమపర్వతంబులో
యడఁపఁగ నింకఁ జేయఁగ నవార్యపయోధులో యామహాత్మకుల్. 89

చ. పలివిధి యేమి యెవ్వనికిఁ బ్రాప్తమొనర్చునొ వచ్చునంతయే
యతనికి నీచసంశ్రయమహాశ్రయముల్ గుఱిగావు సర్వది
క్ప్రతతులు నిండి మేఘములు ప్రత్యహముం గుఱియంగ నేయభీ
ప్సితములు గల్గె ద్విత్రిజలబిందువులే కద చాతకాళికిన్. 90

ఉ. అంబుజబాంధవుం డహరహంబును దగ్గరివారిఁ గూడియే
యంబరఖండమాని తిరుగాడుచునుండును గ్రుంకుదాఁక న
య్యంబరఖండ మొందిరె సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రులెల్ల దై
వంబె ఘటించినన్ గడపవచ్చునె దుర్గతి యెంతవారికిన్.

---

## కర్మపద్ధతి.

ఉ. ఆనతిసేతునో సురల కయ్యమరుల్ హతవిధ్యధీనులే
యానిఖిలైకవంద్యుఁ డజుఁ డాతఁడు కర్మఫలప్రదుండె క
ర్మానుగుణంబు తత్ఫల మజాదులచే నగుటేమి పద్మజుం
డేనియుఁ గర్తగాఁడు ప్రభువింతకు కర్మముగాన మ్రొక్కెదన్. 91

చ. నెఱి నజు నండభాండకృతి నేమపుఁగుమ్మరిఁ జేసె నెద్ది శ్రీ
హరిని దశావతారగహనాప్తిని సంకటపెట్టె నెద్ది శం
కరునిఁ గపాలపాణిపుటకంబున భిక్షుఁ జొన్పె నెద్ది భా
స్కరు దివిఁ ద్రిప్పు నెద్ది యల కర్మముఁ గూర్చి నమస్కరించెదన్. 92

చ. కొఱగను సాధుగా మొఱకు కోవిదుగా నలి మిత్రుగా నగో
చరము సుగోచరంబుగ విషం బమృతంబుగఁ జేయు నెద్దియా
స్థిరతరసత్కృతిన్ భగవతిన్ భజియింపు మభీష్టసిద్ధికో
నరసుత మానితామితగుణంబుల నేల వృథాస్థ జెందఁగన్. 93

చ. సురుచిరకర్మమున్నపుడు సున్నపుమిద్దెలు చిన్నిపాయపుం
జెళ్ళువలు తెల్లనౌ గొడుఁగుసీడల హెచ్చులు లచ్చియుం న్నిరం

తరమయినట్టు లుండు నది తప్పిన సెంతయుఁ గంతుసంగరాం
తరహతతంతుమౌక్తికవితానగతిన్ వితథమై వడిన్ జెడున్. 94

చ. గుణమగుణంబు నైన క్రియఁ గోరి యొనర్పఁగఁ బూనుపండితా
గ్రణి మును మున్నె సేయఁదగు కర్మముపాకము నిశ్చయించి ని
ర్ఘృణమతి చేయఁ జెల్లు శుభసత్క్రియ లెంచక చేసినన్ దను
ల్బణఫల మబ్బుదాఁకఁ గృతిపాకము హృద్గతి నేర్చు శల్యమై. 95

చ. జననము కర్మభూమిఁ గని సత్క్రియలేని జడుండు చందనేం
ధనముల నువ్వుపొట్టు రతనంపుఘటంబున వండువాఁడు కాం
చనహలమూని క్షోణి దివసప్రభు దూడికి దున్నువాఁడు బా
య నటికి కప్పురంపువెలుగారిగ చేసికిబెట్టివాఁడగున్. 96

చ. సుమహితరూపమున్ గులము శుద్ధపుశీలము విద్యయున్ బ్రయ
త్నము గలరాజసేవ విదితంబులె నిక్కము పూర్వజన్మపు
ణ్యముల జనించుసంచితసమంచితభాగ్యములే ఫలించుఁ గా
లమున ఫలించువృక్షములలాగున సత్యము మర్త్యకోటికిన్. 97

చ. జలముల మున్గఁగాక సురశైలము పైకొనుఁగాక శత్రులన్
బెలుకుర సేయుఁగాక కృషి బేరము సేవలు సేయుఁగాక వి
ద్య లెఱుఁగుఁగాక పక్షివలె నభ్రగతిన్ జనుఁగాక యెంతగా
సిలినను రాదు రానిది గృశించ దవార్యము కర్మపద్ధతిన్. 98

చ. అడవులనైనఁ దోయములనైన విరోధులలోననైన మం
డెసుదవమధ్యమందయిన నీరధినైన మహాద్రినైన నె
క్కుడనయినన్ బ్రమాదగతిఁ గాంచిన నిద్రవహించినన్ భరం
పడి విషమస్థితుండయిన ప్రాక్సుకృతంబులె బ్రోచు మర్త్యునిన్. 99

ఉ. ఘోరవనంబు పట్టణమగున్ జనులెల్ల స్వకీయు లౌదు రి
ద్ధారుణియంతయున్ ధననిధానమణీగణపూర్ణమై తగున్
భూరితరైకసత్క్రియలు పూర్వభవంబునఁ జేసి యన్నిటం
గౌరవ మొందు ధన్యులకు గావున ధర్మము సేయఁగాఁ దగున్. 100

చ. ఉరుగుణయోగి భర్తృహరియోగి చమత్కృతి సంఘటింపఁగాఁ
గరము దనర్చు నీతిశతకం బిటుబట్టి తెనుంగుబాసచేఁ
దిరముగఁ జెప్పెఁ బుప్పగిరితిమ్మన చంపకమాలికావరం
[illegible]లుగఁ బండితు లెంతయు సంతసింపఁగన్.

నీతిశతకము సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1926.